# ఆనందాశ్రమగ్రంథరత్నమాల

| | | |
|---|---|---|
| శ్రీమదాంధ్రభాగవతము-కిత్తానుబైండు | 3 | 0 |
| డిటో కాలికోబైండు గిల్టుపేరు దళసరికాగితములు | 4 | 0 |
| శ్రీమదాంధ్రమహాభారతము-కాలికోబైండు గిల్టుపేరుదళసరి కాగితములు ఆదిపర్వసభాపర్వములు | 1 | 12 |
| డిటో ఆరణ్యపర్వము | 1 | 12 |
| డిటో విరాటోద్యోగపర్వములు | 1 | 12 |
| డిటో ఆదిపంచకము (ఆది-సభా-ఆరణ్య-విరాట ఉద్యోగపర్వములు ఒకసంపుటముగా) | 5 | 0 |
| డిటో భీష్మద్రోణపర్వములు | 1 | 12 |
| డిటో కర్ణ శల్య సౌప్తిక స్త్రీపర్వములు | 1 | 12 |
| డిటో భీష్మ, ద్రోణ, కర్ణ శల్య సౌప్తిక, స్త్రీపర్వములు ఒక సంపుటముగా | 3 | 4 |
| డిటో శాంతిపర్వము | 1 | 12 |
| నిర్వచనోత్తరరామాయణము అట్టబైండు | 0 | 12 |
| డిటో కాలికోబైండు దళసరికాగితములు | 1 | 2 |
| అమరకోశము త్రికాండము సటీకము ఇంగ్లీషు అర్థముతో | 1 | 4 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము దళసరి కాగితములు కాలికోబైండు | 1 | 8 |
| మనుచరిత్రము సటీకము కాలికోబైండు దళసరికాగితములు | 1 | 8 |
| డిటో గిలుపేరు మిక్కిలిదళసరికాగితములు | 2 | 8 |
| విక్రమార్కచరిత్రము, పద్యకావ్యము అట్టబైండు | 0 | 14 |
| ఆంధ్రనిఘంటుత్రయము సటీకము దళసరికాగితములు కాలికోబైండు | 0 | 12 |
| డిటో డిటో అట్టబైండు | 0 | 10 |
| శ్రీమద్భగవద్గీత మూలము పాకెట్ సైజు | 0 | 4 |
| రాఘవపాండవీయము టీకాతాత్పర్యసహితం | 1 | 8 |
| ఆచార్యసూక్తిముక్తావళి | 2 | 8 |
| సుందరకాండ మూలం | 0 | 12 |

శ్రీ

# సంగీత సైంధవార్జునము.

ఇది

మ॥ రా॥ శ్రీ గాడేపల్లి సూర్యనారాయణశర్మగారిచే
రచియింపంబడి,



రాజమండ్రికాపురస్థులయిన
కర్రా అచ్చయ్యగారిచే,



మొదటికూర్పు 1,000

సి. హెచ్చి. కైలాసరావు బ్రదర్సువారి
కమలా ముద్రాక్షరశాలయందు
ముద్రించి ప్రకటింపఁబడియె.

కాకినాడ.

1912.



[వెల రు 0-8-0

# పీఠిక.

---

గుణగ్రహణ పారీణులరగునో యాంధ్రసోదరులారా !

నాటకము లాడుటయందును జదువుటయందు నుపయోగింపఁబడుచుండినను దృశ్యప్రబంధములగుటచే మనముందు రంగస్థలమునకు సరిపెట్టఁబడుట ముఖ్యాంశము. అటులొనర్చుటలో నీ సైంధవార్జునపు గధవంటి యుద్ధకథకు జాలగష్టమున్నదని నాయభిప్రాయము. ఏలయనిన యుద్ధము ప్రదర్శింపజేయుదమన్న నీచపాత్రప్రాబల్యమై చూపఱకు విసుకుఁబుట్టించుచు ప్రదర్శింపక మానువుమన్న గధాస్వారస్యమందందు జెడుటకు సిద్ధమగును. ఎటులైనను భారత యుద్ధమునందెల్ల ముఖ్యంబగు పద్మవ్యూహ సైంధవవధలు రెండును నాయీరెండవ నాటకమునకుఁ గథాంశములగుటచే గొంచెమేని రుచింపక పోదని నానమ్మకము. ప్రదర్శకులనే వేఁడుకొనునది యొక్కటి కలదు. యీనాటకమునఁదలి రంగములలోఁ దత్తద్విషయికసంబరములఁగూర్చుకొనక తమకున్నదానితోఁ బ్రదర్శింపఁ బ్రారంభించిన నాటకమునకులేని విరసము దెచ్చునేమోయని జంకి యట్టివన్నియు సమకూర్చుకొనుఁడనుటయే నాప్రార్థన. ఇఁక గుణగ్రహణధురీణులగు మహనీయులతోఁ దప్పులులేవని నేననలేను. ఉన్నను వాని సకారణముగా నాకుఁ దెలిపియో మఱచినే గ్రహించి యానందించియో సంతుష్టులుగాక పోరను నిశ్చయముతో నాయీచిన్నిపాత్రము సరసాంధ్ర మహనీయులపాలఁ బడవైచుటకు సాహసించుచున్నాను.

ఇట్లు విన్నవించు
గాడేపల్లి సూర్యనారాయణశర్మ
పిఠాపురం.

## ఈ నాటకమందలి పాత్రలు.

### పురుషులు.

ధర్మరాజు—పాండవులలోనగ్రజుఁడు

భీముఁడు—రెండవవాఁడు

నకులుఁడు—నాల్గవవాఁడు

అభిమన్యుఁడు—అర్జునునికొడుకు

సారథి—అభిమన్యునిసారథి

సౌగంధుఁడు }
సౌరథుఁడు } ఖేచరులు

దుర్యోధనుఁడు—కౌరవులరాజు

కర్ణుఁడు—దుర్యోధనుని స్నేహితుఁడగు నంగరాజు

ద్రోణుఁడు—అస్త్రగురువగు బ్రాహ్మణుఁడు

శల్యుఁడు—{ పాండవుల మేనమామయయ్యు - కౌరవులతోఁ గలసి పోరెడు రాజు

దౌశ్శాసని—దుశ్శాసనునికొడుకు

దృష్టద్యుమ్నుఁడు—పాండవులబావ

శ్రీకృష్ణుఁడు—అర్జునుని బావయగు వాసుదేవుఁడు

అర్జునుఁడు—పాండవులలో మూడవవాఁడు కథానాయకుఁడు

సాత్యకి—కృష్ణునితమ్ముఁడు

చారిత్రుఁడు—వార్తావహుండు

### స్త్రీలు.

సుభద్ర—అర్జునునిభార్య



ఓమ్.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# సైంధవవధనము.



నాంది.

రంజిల్లంగఁ బాండవుల్ సమరధా • త్రిన్ దాయలన్ గెల్వనే
దారిన్ బోయిన బాగౌయంచు మదిలో • ధ్యానించిలోకప్రియం
బారన్ వారల కార్యసిద్ధి కొఱకే • యాదిత్యునే నిల్పఁగాఁ
దేరున్ దోలెడి పార్థసారథిమిమున్ • దీవించు నెల్లప్పుడున్॥

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు- (ప్రవేశించి) ఓహో! యీసభాసదు లెల్లరును నిండుజాబిల్లితో నుల్లసిల్లెడి యీ రేయి వీరరస ప్రధానంబగు నాటకమే కేనిఁ బ్రదర్శింపుమని కదా నన్నాజ్ఞాపించిరి. కానిమ్ము పారిపార్శ్వకునితో యోచించెద (తెరవంక జూచి) పారిపార్శ్వకా!

పారి—బావా! యిదేవచ్చితి! నీవేదియో యోచించుచుంటివని నాచెల్లెలు చెప్పుటచే నేమియో యని యింతవఱకు రాకుంటిని,

సూ—ఏమియు లేదు. సుగుణశాలినులగు నీమహాజనుల కోరిక దీర్చుట కుపయోగించు నాటకము వెదకుచుంటిని.

పా—పాడినదే పాటయను నట్లిదివర కెన్నిసారులో ప్రదర్శించి మూలఁబడవైచిన వానిలో వెదకినను వెదకినట్టుండు-మన్నను సామెత వృథాపోవని తలంచెద.

సూ—అయిన నీవు సూచించెడి దేదైన నున్నదా?

పా—ఉండకేమి. ఇప్పుడిప్పుడు లోకమునకుఁ బొడసూపుచున్న క్రొత్త నాటకములలో రసవంతమైనదేదియో యోచించుటయే నాసూచన.

సూ—అయిన సైంధవార్జునమనునది ప్రదర్శింతుమా?

పా—అందలి కథావిషయమెట్లుండును?

సూ—భారతయుద్ధమందెల్లముఖ్యంబగుపద్మవ్యూహ సైంధవ వధలు రెంటిని దెలుపును

పా—ఆహా! అట్లైన బావా! యదియే ప్రదర్శించెదము. ఏలయనిన.

సీ॥ కుంభవృష్టిగురియు • గొప్పమబ్బులుపోఁ
బటునిర్మల వియ • త్పథము వెలుఁగ
సలిలధారలచేత • జరితపత్రములూడ
నమలదళాంభోరు • హంబులలర
దుర్దినంబులు నెల్ల • దూరమైపోవంగ
నతిమోదకరహంస • తతులు వెలయ
నిత్యభీతిదమైన • నిర్ఘోషమడఁగిపోఁ
దతగానపూరది • క్తటములొలయ

గీ॥ ధూళిరేఁగుచు నింగి • మేఘాళిఁజేయ
భయదకార్ముకములు శర • వర్షమీన
గర్భనిర్భేదసకలసై • న్యార్భటులను
సమరముల్ సేయఁగాఁదగు • సమయమిదియె!.

కావునఁ గేవల వీరరసప్రధానంబైన యీనాటకము సభాస్థాయుల నానందింపఁజేయకమానదు.

సూ—సరే! నీప్రయత్నముమీఁద నీవుండుము.

పా—ఔనుగాని గ్రంథకర్త యెవఁడో చెప్పకయేయెట్లు?

సూ—మొన్నటిపాశుపతార్జున నాటక గ్రంథకర్తయగు గాడేపల్లి వంశోద్భవ వేంకటశాస్త్రి జ్యేష్ఠపుత్రుఁడైన సూర్యనారాయణయే.

పా—శైలియెట్లుండునో కదా!

సూ—ఆవిషయమంతయు గుణగ్రహణపారీణులగు నీమహాజనులే నిర్ణయించి ముచ్చటించెదరుగాక. మునుముందు—మనవర్ణనములేల?

(తెరలో).

మ॥ కుటిలద్రోణధరామరాశుగవర • క్రూరాంబుధారల్ సహిం
చుటయే కాక యనేకభీకర బలో • చ్ఛృంభజ్జలానీకమున్
బటువేగంబున నీదు మంధరధరా • భ ప్రాకటస్థైర్యలం
పటువీరాగ్రిసరద్విపావళిని • బద్మవ్యూహమూఁపెన్ గటా॥

సూ—(త్వరతో) రారమ్మ ధర్మజుఁడప్పుడే ద్రోణుని పద్మవ్యూహమునకై చింతించుచునొక తట్టుజేరుచున్నాఁడు.

పా—సరె! పదపద.

(నిష్క్రమింతురు)

ప్రస్తావన.



ఓమ్.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# సైంధవార్జునము.

## ప్రథమాంకము.

ప్రదేశము-రణభూమి ప్రవేశము-ధర్మరాజు

ధర్మరాజు. (ఖిన్నుఁడై)

మ॥ పటిలద్రోణధరామరాసుగవర • క్రూరాంబుధారల్ సహిం
చుటయే కాక యనేకభీకరబలో • చ్చుంభజ్జలానీకమున్
జటువేగంబున నీదుమంధరధరా • భ్రప్రాకటస్థైర్యలం
పటపీరాగ్రసరద్విపాళినిబ • ద్ధవ్యూహమౌఁ గెన్గటా!.

ఏమిసేయుదు? దీనికేది తెరువు? ఎట్టెట్టో వనవాసంబుఁగడపి యజ్ఞాత దేశంబున సేవకావృత్తి నిర్వర్తించి బైటఁబడితిమిగదా యని సంతసింప నీ యుద్ధమేటికి వచ్చె. పోనిమ్మట్లో భీష్మునిఁ గెడప నీద్రోణాచార్యుండేల యీ పద్మవ్యూహముఁ బన్నవలెను? నాకేమియుం దోఁచకున్నది. బలమాసన్న గిల్లుచుండె. అర్జునుఁడా పోయి త్రిగర్తలనారాయణులతోఁ బోరుచుండె. దీనిఁజించువాడును గానరాడు. అదిగో! భీమన్నయు దీనమానసుఁడై యిటు వచ్చుచున్నాఁడు వీఁడేమియనునోకదా!

భీమ— (ప్రవేశించి)

శా॥ అన్నా! యేమనిచెప్ప నాగురుఁడభే • ద్యంబైన వ్యూహంబుఁదాఁ
బన్నించెన్ గద దానిలోనికిసుర • వ్రాతంబుతో నింద్రుఁడై
నన్నక్రంబుజనంగ లేఁడ! యతఁడున్ • నానావిధాస్త్రాళిచేఁ
గన్నన్ విన్నదికాని యుద్ధము జెలం • గన్ ముందు గానిత్చెఁగా॥

కావున మనవారేరును వారిఁదేజీపాటఁ జూచుటకు నోడుచున్నారు. కర్తవ్యమాలోచింపక తప్పదు. పద్మవ్యూహముఁ జెండాడుట ముందుకర్జము.

ధర్మ— ఆహా! భీమసేనా! దీని కేదేనియుపాయము చెప్పుటకును కృష్ణుడర్జునుతోఁ బోయెఁగదా! చిన్నప్పటినుండియు మనపై వాత్సల్య మగపఱచిన ద్రోణుఁడే యిటులొనర్పనేమనఁగలము. పద్మవ్యూహమును జొరుట యెవ్వరికింగాదు-(పరికించి) అదేమి (నేపథ్యమున కలకలము)-

నకులుఁడు-(ప్రవేశించి యాత్రముతో)అన్నా! త్వరపడుము! త్వరపడుము! ద్రోణహతకుని కోల్తల కోర్వలేక సైన్యమంతియు గగ్గోలుపడుచున్నది వెన్నిచ్చిన మఱలఁద్రిప్పుటకష్టము.

భీముఁడు--నకులా! యేమియీతొందర? మన బావయుండెఁగదా మునుముందుదవ్వి మొగ్గరముం జొచ్చువారెరును గానరారు. మనమెంతనిఁజూచినను లోనికిఁ బోఁజాలముగదా!

నకులు— దీనిం జెండాడువారా!

గీ॥ పార్థుఁడును కృష్ణుఁడునుదక్కఁ • బరులుదీనిఁ
జొచ్చి చెండాడు ధీరులు • జూడలేరు
అర్జునుఁడు మనలవీఁడి • యరుగుటఁగని
ద్రోణుఁడిద్దానిఁబన్నెఁబో • దుష్టబుద్ధి॥

ధర్మ— కష్టా! మన యభిమన్యుండో

నకులు— (స్మృతినభినయించి) ఔనౌనన్నయ్యా!

గీ॥ శత్రుభీకరుఁడు విజయ • పుత్రుఁడమ్మ
గర్భముననుండి యేపినెఁ • గంజవిదళ
నక్రమంబుఁగావున నాయ • నకవిక్ర
మాద్భ్యుఁబంపిన మనకుఁగా • ర్యంబు జరుగు॥

భీమ— అన్నయ్యా! సంశయమేల యాతని బలపరాక్రమ విషయంబుల నెఱుంగుదుఁ బంపుటయే యుచితమని నాయభిప్రాయము

ధర్మ— తమ్ముఁడా! భీమసేనా! నెఱుంగక పోలేదు కాని బాలుఁడని శంకించుచుంటి కాని నకులా! నీవుపోయి యాతనిఁ దీసుకరమ్ము.

నకు— చిత్తము. (అని యేగివెంటనే యభిమన్యుతోఁ బ్రవేశించును)

అభిమన్యుఁడు-తండ్రీ! నమస్కారము. (అని ధర్మజభీములకు నమస్కరించును)

ధర్మ— (లేవదీసి)

ఆ॥ వె॥ సాకుమారరార! నలినలోచనరార!
మేరుధీరరార! వీరరార!
విజయపుత్రి రార! విజితశాత్రవరార
కాగవారి రార! ఖరకరాభ!.

(ప్రక్కఁగూర్చుండఁబెట్టుకొనును వారితో నందఱు గూర్చుండురు)

అభి— తండ్రీ! వీరధర్మైకశూరులగు మీరలు నన్నిప్పుడు రావించిన కార్యమేది యో యూనతీవేఁచుచున్నాను తండ్రులమాట జవదాఁటననియు మనవిఁ జేయుచున్నాను.

భీము— (విచారసూచకముగా)

ఉ॥ శాత్రవసైన్యమొక్క మొగి ♦ శాతశరాతతఘాతచేతమా
గాత్రము లింతలింతలుగ ♦ ఖండితమానటు జేయ మీరలే
చిత్రము చూచుభంగిమముఁ ♦ జేరక యూరక యుండ బాడియే?
అభి— పుత్రునిమీఁద వత్సలతఁ ♦ బొందివచింపుఁడు కార్యపద్ధతుల్॥ 6

నకు— అబ్బాయి! అభిమన్యా!

ఉ॥ రుద్రసమానతేజుఁడు గు ♦ రుండట రెండవభానుఁబోలియ
చ్ఛిద్రపరాక్రమంబున న. ♦ శేషబలాన్వితు లందఱాజిలో
భద్రతతోడఁ దన్నుఁగొలు ♦ వన్మును ముందుగ నిల్చియుండెసౌ
భద్ర!యిఁకెట్లుపోదుముకృ ♦ పామతు లేరును దారిఁజూపరే॥ 7

అభి— మ॥ నరవీరైకధనాఢ్యులార! శరవి ♦ ద్యచ్ఛ్రేష్ఠులారా! ననున్
బరమ ప్రేమను బెంచు తండ్రులరసం ♦ ప్రార్థ్రిచిత్తంబులో
నరిసైన్యంబులమీఁదికిన్ బనుపుడ ♦ య్యా వేగ మేనన్నుసం
గరరంగద్విశిఖప్రయోగకలనన్ ♦ గాఁజించెదన్ శత్రులన్॥ 8

ధర్మ— కుమారా- సౌభద్రా!

ఉ॥ దుర్జయుఁడర్జునుండు కడు ♦ దూరమరాతులగెల్వఁబోయె భూ
నిర్జరుఁడౌ గురుండునవి ♦ నీతిరతుండయి మొగ్గరంబొగిన్
గర్జమటంచుఁబన్నెనదె; వి ♦ కావికలయ్యె బలంబులక్కటా!
యర్జునపుత్ర! కట్టువడు ♦ దయ్యా! నినుంబనుపంగ నెట్లగున్?॥ 9

అభి— తండ్రీ యిట్లుశంకింప నేటికి?

ఉ॥ విష్ణుని యంశమైన యదు ♦ వీరుని యల్లుఁడ నాదునింక నా
జిష్ణునికూర్మిసూనుఁడన ♦ సేవనితాస్త్రవిదుండనై సుబా
రిష్ణులరైన మీరు వివ ♦ రించెడి దీవనలంది శౌర్యవ
ద్ధిష్ణుఁడనై రణస్థలిఁ జ ♦ రించిన నన్నలయించువాఁడు నే? 10

నకు—క॥ అన్నా! యేటిభయము మే
మున్నాము గదయ్య రిపుల ♦ నోర్చుచుఁబోవన్
బిన్నండంచుఁ దలంపకు
క్రొన్ననకు సుసౌరభంబు ♦ గొంచెంబగునే?॥ 11

భీము— అన్నయ్యా! యీవెఱ్ఱివెఱపు లేటికిఁ? కుఱ్ఱవాని నెక్కటిగ వదలి మేమూర కొందుమనుకున్నారా! అదియుఁగాక!

గీ॥ కదనభూమిని వైరులఁ ♦ గదలమొదల
కుండనుద్దండభుజగదా ♦ దండములను
బిండిగుండగఁ జెండాడు ♦ మొండిబలమె
కాని యీగుంటచిక్కుల ♦ నేనెఱుంగ॥ 12

కావున నెట్లయిన నీకుఱ్ఱ నాశీర్వదించి సుక్షత్రియోచిత కీర్తికోలాలాలితుం జేయఁబంపుఁడు.

అభి— తండ్రీ! యనుజ్ఞనీవేడెదము.

గీ॥ క్షాత్రధర్మైకభూషణ ♦ పాత్రులైన
తమకుఁబుత్రుఁడ నయ్యు నే ♦ ధరణిశత్రు
సైన్యములద్రుంచకుండుట ♦ శౌర్యమగునె?
ముదముతోడుత బంపుము ♦ మ్రొక్కువాఁడ॥

(అని సాగిలి మ్రొక్కును.)

ధర్మ— (లేవఁదీసి) వత్సా! లేలెమ్ము నన్ను దీనికింత వేఁడికొనవలెనా?

గీ॥ తల్లిదండ్రులానందాబ్ధిఁ • గొల్లగొనఁగ
శత్రుభీకరమారీతి • సంగరంబు
జేసిస్వస్థతఁ గీర్తియో • ప్పిల్లఁగామఁ
బొంది యానందవారధి • నందుదీవు॥ 14

అభి— తండ్రియాజ్ఞ (అనిమఱల మ్రొక్కి) సారథీ! సారథీ (అని పిలువఁగా నొకసారథి ప్రవేశించును).

సారథి— దేవా! నమస్కారము (ధర్మజునకు నమస్కరించి) కుమారా! యాజ్ఞ!

అభి— సారథీ! మద్రథంబు సకలాయుధోపేతముగా నమర్చి వేవేగ తోడితెమ్ము నేనిదె తమ్మిమొగ్గరముఁజించి శత్రులఁ జెండాడఁబోవుచుంటి

సారథి— చిత్తము (అని సందేహించును)

అభి— (చిఱునగవుతో) ఏమిట్లు సందేహించెదవు? యుద్ధమన్న భయపడుచుంటి వా యేమి?

సారథి— కుమారుండుండ భయమేమిటికింగాని.

మ॥ పదియారేఁడుల బాలుఁడీవుకద! శుంభచ్ఛస్త్రవిద్యా విశా
రదదుర్యోధన ద్రోణ కర్ణకృపశ • ల్యద్రౌణిసంరక్షితం
బదియుందున్ గమలంపు మొగ్గరము కు • ఱ్ఱా! యెట్లు చెండాడెదో
కదనం బెట్లు చెలంగునో యనుచు • శంకల్ పుట్టెనామదిన్?॥ 15

అభి— (చిఱునవ్వుతో) సారథీ! ఏమిటి ఆలాగా!

శా॥ ద్రోణుఁడంచు కృపుండటంచు మఱియా • దుర్యోధనుండంచు నే
సూతుండంచు భయంబుఁగొల్పకికఁ న • స్తోకాస్త్రసంఘాతితో
స్థాణుండేయరుదెంచినన్ సురలతో • జంభారితావచ్చినన్
రానిమ్మెవ్వరినైన నేభయపడం • గ్రామంబులోఁజెండెదన్। 16

సారథి— (సంతోషముతో) చిత్తము కుమారా! నేనిదే యేగి మద్రథంబాయితంబు జేసి దీసుకవచ్చెదను సెలవా?

అభి— సారథీ పో! పో వేవేగ రావలె.

సార— చిత్తము (నిష్క్రమించును)

భీము— సమరోత్సాహసంరంభుఁడై) కుమారా! సౌభద్రా!

ఉ॥ ఖండన మండలిన్ గుటిల • ఖాండజమండితమైనయామోసన్
చెండుచు లోనికీవుచనఁ • జేరియవారిత విక్రమంబునన్
గండరి గండలైనయల • కౌరవులన్ గలగుండు పెట్టియు
ద్దండగదోరుచండహతి • దండధరుండవఁ బింపిఁజేసెదన్॥

సారధి— (ప్రవేశించి) సర్వము సిద్ధమైనవి.

అభి— సరే పద.

(నిష్క్రమింతురు)

ధర్మ— భీమా! మనమందఱము బహుజాగరూకులమై వాని వెనువెంట మొగ్గరము జొరవలెనుమా!

భీము— చిత్తము (నిష్క్రమింతురు)
(వెంటనే యొక ఖేచరుఁడంబర మార్గముననే ప్రవేశించును)

ఖేచరుఁడు- భళా! భళా! శూరుఁడనఁగ నీకుఁబోవాఁడే! అభేద్యంబగు నీమొనఁజించుటకు సాహసించునా? అన్నయ్యా! సౌగంధా! ద్రోణుని పోరుతోనేమి? యిటు రా మన యభిమన్యుని పోరుఁ జూచెదము.

సౌగంధు- (అంబరముననే ప్రవేశించి) తమ్ముఁడా సౌరభా! చూడు చూడుమా యభిమన్యుని ద్రోణునొక్క బాణముతో మూర్ఛపోఁగొట్టి యవలీల లోనికిఁ బోవుచున్నాఁడు

సౌరభు—హాయి! హాయి! మన భీమాదులును వెన్నంటుచున్నారు సుమా!

సౌగంధు- తమ్ముఁడా! యిదేమి సైన్యమంతయు నిట్లు కలగుండుపడుచున్నది?

సౌర— అన్నయ్యా! ఏమియోకాని నాకునుఁ గానరాకున్నది. రజఃపటలము భూమ్యాకాశంబులు నిండ మిన్నుమన్నుం గాన్పించుట లేదు.

సౌగంధు- (పరికించి) అల్లదిగో! మనయభిమన్యప్రియుక్త శరభిన్నశరీరా సృగ్వర్ష బిందువులచే ధూళియడంగె (పరికించి) అయ్యో! తమ్ముఁడా! తమ్ముఁడా! యీసైంధవున కేమిపోగాలను భీమకోపానలమునకు శలభముగాఁ బోవుచున్నాఁడు? అయ్యయ్యో! యెవ్వియో పరుషములుగూడ నాడుచున్నాడు

[అంతఁదెరలో]

గీ॥ ఓరి! భీముఁడ! నకుల! యో ♦ రోరి! విరట
పోరిలో ననుమీఱెడి ♦ వారె? మీరు
పాండవబలాటవికినేనె ♦ చండవహ్ని
నాదుబాణములవె మీకు ♦ నాటఁదోడఁగ॥ 18

సౌరభు—అన్నయ్యా! అయ్యో! చూడుము పుత్రివెనువెంటఁబోఁబోవ నడ్డువచ్చిన సైంధవునితో భీముఁడెట్లు రోషకషాయితాత్ముఁడై హుమ్మని యౌడుగఱచి పలుకుమన్నాఁడో!

[తెరలో]

గీ॥ ఏమిరా! సైంధవా! వన ♦ భూములందు
నాఁడునాచేతి లావునుఁ ♦ జూడలేదె?
నిలుమునంగర భూమిలో ♦ నిముసమైన
మదుగదాదండమున నీ ♦ యుసురుఁబీల్తు॥ 19

సౌగ— అనుజా! హాయి! హాయి! యీభీమునిగద నెంతలాఘవముగాఁ దెగగొట్టివేసినాఁడా సైంధవుఁడు. (ఆతురముతో)ఓహో! యీసారి సైంధవుఁడు చచ్చుట నిజమిఁక నేమున్నది? హాహా విరాట్ద్రుపద ధృష్టద్యుమ్న సాత్యకి ప్రముఖులగు యోధులెల్లరు నొక్కపెట్టి శరనాదంబపారంబుగా బఱపుచు సముద్రములఁబోలె నురువడించుచుండిరి.

సౌరభు—అన్నయ్యా! ఇదేమి? నఱికిన కదళీ తరువులవలె నీకాల్బల మంతయుఁ దురగద్విపములతో జాఁపకట్టుగ నేల కొఱగినది. ఆహా సైంధవుని పరాక్రమము భీష్మద్రోణులకైన నిట్టి కార్యంబసాధ్యంబకాదే! (పరికించి) అయ్యయ్యో పాండవయోధులెల్లరు వెన్నిచ్చిరి.

[తెరలోఁ బెద్దకలమైన తోడనే]

శా॥ ఏమీ! పాండవయోధులార! చనునే ♦ యిట్లందఱున్ బాఱఁగా
మీమీదేహము లెప్పుడున్ దిరములే ♦ మీకెంతయున్ లజ్జలే
దే? మానంబును వీఁడిరే? సబలమై ♦ దేవాసురుల్ రాఁగసం
గ్రామంబందున భీతిఁబొందఁదగునే ♦ రారండు వేవేగమే॥ 20

సౌగం— తమ్ముఁడా! చూడుచూడుము భీముని వాక్కుల విని యోధులెల్లరు సైంధవుని పైఁ గలియుచున్నారు.

సౌరభ— అన్నన్నా! చిరుతపోరులలో సహితము జావదెబ్బలఁ దిను భీతనికి బలపరాక్రమము లెక్కడివి?

సౌగ— తమ్ముఁడా దీనికింతయేటికి?

గీ॥ దేశకాలమనుసరించి • యీశుఁడైన
నుచ్ఛనీచతలెపుడు తే • కుండఁ బోవు
బహుదరిద్రత చేఁగుందు • వాఁడొకండు
కాలగతి ధనవంతుఁడై • క్రాలుఁగాదె?॥ 21

సౌర— ఔనౌ నది నిజమే కాని బలపరాక్రమములు కాలగతిచే వచ్చునవి కావని నాయభిప్రాయము ఏలయనిన?

గీ॥ వేఁపునకు దీపెపుడు సంభ • వింపఁగలదె?
యిసుక పఱ్ఱల వరిపంట • పొసఁగఁగలదె?
నక్కనోటఁ గానంబువి • నంగలామె?
పిఱికిపంద విక్రమమును • విధమె కాదె?॥ 22

కావునఁ బిఱికిపందలలో మొదటివాఁడైన సైంధవున కెద్దియేని మహాత్కారణంబుండనోపు లేకున్న మహాబల శౌర్య సంపన్నులగు పాండవులెడ వీఁడెడ?

సౌగం— తమ్ముఁడా! మనకెందులకీవృథా వాగ్వాదము వాఁడుగో కలహభోజన ప్రియుఁడగు నారదుఁడను మనవలెనే యుద్ధముఁ జూడఁగోరి యదృశ్యరూపమునఁ దాండవమాడుచుండె వాని నడుగు మంతయుఁ దెలియును.

సౌర— సరే. మహాత్మా నారదా! సైంధవున కీపరాక్రమముగూడ ద్వాపర విచిత్రములలోనిదేనా?

[ తెరలో ]

ఔనుగాని దీనికి నొక కారణము గూడనుండె. అరండట్లు భీమాదులచేఁ బరాభవింపఁబడి యీశ్వరుంగూర్చి తపంబాచరించినాఁడు. అప్పుడాశంకరుడిచ్చిన పాండవుల నిలువరించుటకు దినమీదిన**మే**! ఇదియే యీయార్భాట మంతయు.

సౌర— సరి సరి మహాత్మా! అభిమన్యునకుఁ జాలఁగష్టమే

[తెరలో]

ఇందుమూలముననే కాదు వానికి మొనఁజించుటయే కాని వెడలివచ్చుట తెలియదు.

పౌగం—— తమ్ముఁడా రా రమ్ము టుపోయి యా బాలుని పోరే చూచెదము.

(అని యిద్దరు ప్రక్కకుఁ బోవుదురు).

పౌరభు——(మంచె గిభయాతురముల తో)ఆయ్యో! అన్నయ్యా! నాకు మిగుల భయము బగుచున్నది. యీ బీభత్సాకృతిం కెందిన బైభత్సయుని యుద్ధము జూడఁ జాల (మఱలఁ బరికించి) ఆహా! అన్నయ్యా! కౌరవసైన్యమను సముద్రము ను సౌభద్రుఁడను బడబానలము పీల్చిపిప్పిఁ జేయుచున్నది సుమీ!

పౌగం—— (పరికించి) ఇంతయుద్ధము మన మొక్కచోటనుండి కాంచలేము నీవక్కడకు బొమ్ము.

పౌర—— సరే. (అని ప్రక్కకుఁబోవును)

పౌగ—— తమ్ముఁడా, తమ్ముడా! అయ్యయ్యో చూడుచూడుమా కరులగములు వజ్రపాతపర్వతములబోలి దేవోపహతకాల మేఘములకరణి నొక్క మొగిఁజిదుప చిదుపలై భూమిపై రాలినవి.

పౌర—— అన్నయ్యా ఏమని చెప్పుదును? ఆరువందల రథికులు రథాశ్వసూతకేతనములతో రణపటలమును గలసిరి. అబ్బ! నీకగపడుచున్నదా శ్రదా యీకాల్బముపాట్లు? (పరికించి) అన్నయ్యా! అయ్యయ్యో! దుర్యోధనుఁడు రథముపైఁబడిరయె నన్నన్నా కర్ణుఁడుపాఱిపోయె. అశ్వత్థామ యభిమన్యుప్రయుక్తకూర్నిరనారాచము వక్షస్థలము నుచ్చిపోవుటచే నట్టె చిత్రరథమునఁ దనపుణ్యాకొఱగెను.

పౌగ—— పౌరభా! పాపమీ ద్రోణుఁడు గీర్వాణబాణమనుమని బాణజాలమునకు ప్రాణములు వీడినట్లు రథముపై సోలినాఁడు. నారాయణ! నారాయణ! దుశ్శాసనుఁడు తన రథశకలములే తనపైఁ బడనట్టె యడఁగియుండె.

పౌరభ—— అన్నయ్యా! వినుమా యభిమన్యుఁడేమో యనుచున్నాడు.

[తెరలో]

శా॥ ఓకీ! కర్ణుడ! తొలి ద్రోణ! కృప రో • రోరీశ తా సౌబలా
మీరల్ పాండవులన్ గలంచఁగలరే? • మీప్రాణముల్ నావియా?

క్రూరాస్త్రప్రముఖాయుధాహతి విప్రడే • క్రోలుఁజుఁడీయా
బారావారగభీరధీరధనుఁడౌ • పార్థాత్మజుండే నెసూ 23

[పెద్దకలకలము]

సౌగం— తమ్ముఁడా! ఏమిది యింతకలకలము?

సౌ: భ— అన్నయ్యా! అట్లభిమన్యుఁడార్చి పేర్చి కార్చిచ్చు శుష్కాటవిఁబడునట్లు కోదండజ్యానాదఘూర్ణద్బ్రహ్మాండుఁడై శరపరంపరలఁ బుంఖానుపుంఖముగాఁ బఱపుచు నురువడింప నిలువఁజాలక సైన్యంబంతయుఁ గలగుండుపడి వెన్నిచ్చి పరువంజొచ్చె.

సౌగం— ఔనౌ నిప్పటికిఁ గాన్పించెను. అయ్యో సింగంబులం గనుంగొని పాఱు బశువులభాతి యోధులందఱుం బాఱఁజొచ్చి రయ్యయ్యో

సౌర— అన్నయ్యా! హాయిహాయి! వెనువెంటనే మన సౌభద్రుఁడును గొల్లచే గోవులఁ దోలునట్లు ద్రోలుచున్నాఁడు. అన్నయ్యా ద్రోణుఁడేఁడీ?

సౌగ— అదిగో యామూలనుండి యేదియో యెట్టకేలకు ధైర్యముఁదెచ్చుకొని వా క్రుచ్చుచుండె.

[తెరలో]

ఓహో కృపా! ఓకీకర్ణ! ఓరోరి దుశ్శాసనాది కౌరవ యోధులారా! ఏల యీలీలల నాలమునుండి బేలలై తొలంగఁ జూచెదరు చాలుఁజాలు నిలుఁడు నిలుండు

ఉ॥ సంగర రంగమందు రిపు • సాయకముల్ తగులన్ గలంగిబల్
సింగములన్ గనుంగొనియ • శేవభయార్తతఁ బాఱునట్లుగా
రంగతితుల్ పరెన్ బరువ • రాజులుగారఁటె ? సిగ్గులేదెమీ
కుం; గులగౌరవంబుతమ • కుంగలఁజేరణ భూమియాఁగదే ॥ 24

సౌగ— తమ్ముడా! చూచితివా యీద్రోణుఁడన్న పోటుమాటల కులికి యోధులెల్లరు తమ తమబలంబులతో నురువడించుచుండిరి.

సౌరభ— అయ్యయ్యో! అన్నయ్యా, యీవెడంగుబుద్ధి దుర్యోధనుఁడు సౌభద్రుపై వహ్నిజ్వాలలఁ బడసెంచు మక్షికంబు చందంబునఁ బోవుచున్నాఁడు.

సౌగ— వినుమా కృపాచార్యుండేదియో యెలుంగెత్తి చెప్పుచున్నాఁడు.

[తెరలో]

శా॥ ఏమీ బొమ్మలఁబోలి నిల్చెదరు మీ • రీరాజుసౌభద్రుకై
భీమంపుంబలిగాఁగ నీవలచిరే • బీభత్ససూనుండు మీ
కే మీకుఱ్ఱఁడటంచుఁ దోఁచెనఁటె? వె • య్యేలా? యితం డెప్డు సం
గ్రామంబందున శూలపాణి యని నిక్కం • బాత్మలో నమ్ముఁడీ॥ 25

సౌరభ— ఓహో పునరుత్పాదితధైర్యోత్సాహులై ద్రోణకృపాశ్వత్థామాదియోధులెల్లరు దుర్యోధనుఁదలమిగిలియొక్క పెట్టునదట్టముగా నంపగములఁబర్వికొనుచు నభిమన్యుపైఁ గవిసిరి.

సౌగం— తమ్ముఁడా వీరలెన్నిసారుల మొనలుఁ గూర్చుకమీఁదఁ బడినను సౌభద్రునితోఁజాలరుసుమా! చూడు మప్పుడే యాఁబోతులఁ గనిన బెబ్బులిఁబోలె బొబ్బరించుచు నబ్బలంబుల నుబ్బడంచుటకై మెఱుంగు వాలుటమ్ములఁ గుప్పఁగూరఁగాఁ బఱపఁదొడంగె.

సౌర— అన్నయ్యా! ముదుసలియగు కుంభసంభవుండు వేవేగయయ్యాద్రి మనుమనిపైఁ దొడరె.

సౌగం— అబ్బా కనంబడిరి. అయ్యో! ద్రోణుఁడు చచ్చె నిఁక నేమున్నది. కుమారుం డాగ్నేయాస్త్రమైతె

సౌర— అన్నయ్యా భయములేదద్దాని వారుణాస్త్రమునమఱలించి తోడనబ్రహ్మాస్త్రమేసె నాద్రోణుఁడు.

సౌదం— హాయిహాయి! ద్రోణప్రయుక్తబ్రహ్మాస్త్రముబూదెఁగలసినది.

సౌర— అన్నయా విజయాత్మజా శుగాసన నిర్ముక్తవిష ప్రోద్ధిత ఘనశక్తిచే ద్రోణుఁడు మూర్ఛిల్ల సూతుండవులకు రథముతోలుకొని పోవుచున్నాఁడు.

సౌగ— తమ్ముఁడా! ఏదియెట్లున్నను.

గీ॥ ఆసుభద్రయెట్టి తపంబుఁ • జేసెనో కా
విజయుఁడే దేవతలను సే • వించెనో కా
శత్రుసంహార కారక • పుత్రవరుఁడు
మేరుధీరుఁడీతఁడు జ • న్మించుటకును॥ 26

సౌర— ఔనౌనన్నయ్యా;

గీ॥ రణపటిష్ఠుండు ధీరుండు ♦ రాజులకును
వేదవేదాంగకుశలుండు ♦ భూదివిజుల
కాత్మజులుగాఁగ బుట్టగా ♦ ర్యంబు జరుగు
మఱియెటులొ మాఱఁగలికాల ♦ మహిమసుమ్ము॥ 27

అదియుఁగాక.

గీ॥ పిఱికి పందలు మూఢులు ♦ వేనవేలు
గలుగ నేటికిఁ దమతల్లి ♦ కడుపుచేటు
చండరిపుభీకరుండు పు ♦ త్రుండొకండు
గలుగఁ జాలదె? దివిదివా ♦ కరునిమాడ్కి॥ 28

(పరికించి) అయ్యో అన్నయ్యా! మనము నూడనేలేదు అప్పుడే రణభూమి యంతయు రక్తసముద్రమై యుబుకుచున్నది.

సౌగ— తమ్ముఁడా! వాఁడుగో దుర్యోధనుఁడు లేటమొగముతోఁ గర్ణునియొద్దకే గుచున్నాఁడు అల్లదిగో దూరముగా ద్రోణుఁడును జేరుచున్నట్లున్నది. రా రమ్మటు పోయివారి యధీరాలాపంబుల విందము

సౌర— సరే.

(నిష్క్రమింతురు)

[వెంటనే కర్ణదుర్యోధనులు ప్రవేశింతురు]

దుర్యోధనుఁడు—మిత్రమా అంగరాజా! యిదేమి యిటుల వచ్చినది?

కర్ణుఁడు—ఏమున్నది? మన గ్రహచారము లేకపోయిన

గీ॥ అమరసైన్యముతోడిజం ♦ భారికైన
బహుగణములతోఁ గైలాస ♦ వాసికైన
దేఱిచూడంగ రాకుండు ♦ ధీరవరులు
కల్గుఁడగు వీనిచేఁగలం ♦ గుటయె కలదె?

ఇట్టి సుభద్రాసుతుండు దుర్నిరీక్ష్యుండై యొకగడియయున్న మనమందఱము జమపురికి విందుకేగుట నిశ్చయమే; ఇప్పటికే వీనిచే నారువేల రథికులు నంతకొక మహాగు దంతావళములు నంతకొక పదుఁగు వాహనములు నంతపదాదులు నేల కొఱగిరి. కర్తవ్యమేమియుఁ దోచకున్నది. మనయోధుల బలంబులును గ్రమక్రమంబుగ క్షీణించుచున్నవి.

దుర్యో— (నిరుత్సాహముతో) అయ్యో మనమనుకున్నవన్నియు గొంతెమ కోర్కెలే యౌనా? లోకగురుండగు ద్రోణుండును సన్నగిల్లె.

(ద్రోణుఁడు ప్రవేశించి ఖిన్నుఁడై యూరకుండును)

దుర్యో— మహాత్మా గురుప్రవరా!

ఉ॥ ఏమనివిన్నవింతు మన ♦ హీనదశన్ జతురంగసైన్యముల్
భూమికిఁ జాలఁ గానొదిగె ♦ భూసుర! భాసుర బాణకౌశలుం
డామహితాత్ముఁడేయు నిశి ♦ తాసుగముల్ బశివీరవారమే
మేమియటంచు నించుక స ♦ హించక కించఁ జరించిరక్కటా॥

కర్ణ—(వికటముగా దుర్యోధనునితో)

గీ॥ సర్వసేనాధిపతి భూసు ♦ పర్వుఁడితఁడు
మీఁడు మిక్కిలి శరగురుం ♦ డాదినుండి
యట్టి యితఁడుంటనీకేటి ♦ యార్తి? కంద
పిలకకును దురదబ్ ♦ చ్చలిక్కనేల?

ద్రోణు—(కర్ణునితో) కర్ణా! ఏటికట్లనియెదు?

క॥ ముమ్మారున్ సౌభద్రుం
డమ్మాడ్కిన్ నొలయనేయ ♦ నడమకమలలన్
సమ్మతి సేవలతోనే
నమ్మహితాత్ము సెదురంగ ♦ నరసితి కాదే?॥ 32

అదియుఁగాక.

గీ॥ సకల గుణాఢ్య మాన్యుఁడు ♦ శత్రుసైన్య
సంహరణ చణైకబలుఁడు ♦ సమరభూమి
జేతఁ గోదండకాండంబు ♦ చెలఁగుచుండ
నితనిఁ జనకంగ ఫాలాక్షుఁ ♦ డెట్లు చూచు?॥ 33

దుర్యో— మహాత్మా! మీరలే యిట్లన్న నెట్లిఁక. శిష్యుండ నన్ను రక్షింపుఁడు.

ద్రోణు—రాజా

చ॥ పలువురు చుట్టుముట్టి కడు ♦ వంచనయుక్తిచుఁ దలంచ కాతనిన్
సులువుగ విల్లునన్ విరిచి ♦ సూతునిఁ జంపి రథంబుఁ గూల్చియా

వలసమయింపనెంచినను ♦ వచ్చునుగాని శరాసనంబొగిన్
మెలఁగుచుఁ బాణినున్నఁ దర ♦ మే పరమేశ్వరుకైన నోర్చఁగన్॥ 34

దుర్యో— మారణధర్మము మారణకర్మమేకదా! మహాత్మా!
కర్ణ— ఔనౌనందులకు సందేహమేమి?
ద్రోణ— (తనలో) ఇటువంటి నేటికి నామాట దాఁటక యీబూటకుల మోసము జేయ సాహసించుచున్నారు కాలము నీమహిమ కాఁబోలు నిదియంతయు.
దుర్యో— మహాత్మా! రండు యేదియో చూచుకొందము.
కర్ణ— చూచుటయేటికి? నేనుంటినిగదా?
దుర్యో— సరే నడువుఁడు

నిష్క్రమింతురు)

(తరువాత రథారూఢుఁడై సారథితో నభిమన్యుఁడు ప్రవేశించును)

అభి— సారథీ! కౌరవయోధులెల్లరు పోయినపోకగా మరల రాలేదేమి?
సారథి— కుమారా! యింక్కడి కౌరవ యోధులు

మ॥ భవదస్త్రప్రకటానల జ్వాలరతి ♦ జ్వాలావృతంబైన కౌ
రవసైన్యోద్ధితశుష్కవృక్షసహితా ♦ రణ్యంబుమార్క్యనిసా
దవరోద్యచ్చటులచ్ఛటాచ్ఛటముతో ♦ దందహ్యమైయుండఁగా
రవయోధాళి యెటుల్కనంబడుసుభ ♦ ద్రాపుత్ర ధైర్యాత్మతన్॥ 35

అభి— దానికేమిగాని చూడుసారథీ!

చ॥ సులువుగ నాదువెంట మొనఁ ♦ జొత్తుమటంచు వచించునాదు తం
డ్రుల రథముల్ కనంబడవు ♦ ద్రోణకృపాదివిరోధి యూథమున్
గలసియు జే మెలంగనటఁ ♦ గావర మొంది యెవండు పాండుసూ
నుల సమరస్థలిన్ నిలిపె ♦ నో తెలియన్ బరికించుసారథీ॥ 36

సారథి— కుమారా! దూరముగాఁ గాంచుము (వ్రేలితోఁ జూపుచు)

గీ॥ వరవరాహధ్వజాలంకృ ♦ తరథమయ్యె
దే. యలజయద్రథుని దరి ♦ తేజిచూడ
రాకభీకరంబయ్యె సం ♦ గ్రామభూమి
ధర్మజాదుల తేరుల ♦ దారిఁజూడు॥ 37

అభి— సారధీ! జొనానుగాన్పించుచున్నది. ఏమిది చిఱుతయోధుఁడగు సైంధవుఁ డేలకో పాండవుల నిలువరించు నంతటి బలాఢ్యుఁడయ్యె కాని కానీ యి ప్పుడైన నేమయినది సారధీ.

గీ॥ మన రథంబునువానికై • మఱలనిమ్ము
వానిఁజంపియే వేవేగ • వత్తుమిటకు
వికృడరణంబు వేయఁగ • నెవరులేరు
కాన మనల కాక్షేపణ • మైనలేదు॥ 38

సారధి— చిత్తము (అని రధమేగుట సూచించునంతలో పెద్ద కలకలము తరవాత)

(తెరలో)

గీ॥ ఓరిసౌభద్ర యేడకుఁ • బాఱిపోదు
వాలమున నిన్నుసమయింతు • మాగుమటనె
చచ్చుటకు ముందువచ్చునీ • చచ్చుతెలివి
తోడనిప్పుడే నీవుచూ • తువుదివంబు॥ 39

అభి— (మహోగ్రకోపముతో)

శా॥ ఛీఛీకౌరవరాజపోషితపశు • శ్రేష్ఠంబులారా! రణ
త్యాగాచారక్షుభిత పరిచారకులా • రా! రాజులేమీరలున్
నీచంబంచుఁదలంచకేరణములో • నిర్లజ్జులై పాటిరే
నాచేతన్ కనుఁగొందురిరండి చటికిన్ • నాకంబుజూపించెదన్॥

(అంత బాణపరంపరఁ బర్వికొనుచు ద్రోణదుర్యోధన కర్ణాది యోధు లు ప్రవేశింతురు)

అభి— ఓహో! కౌరవయోధులారా! చూడుడు నాబాణంబులు మీప్రాణంబులఁ గ్రోల నాలుకలుఁగ్రోలుచున్నవి. (అస్త్రపరంపర లేయును)

దుర్యో— కర్ణ! చచ్చితినిరాఁ! బాధనటించి మఱల బాణమువేయును)

శల్య— హాయిహాయి. యీదెబ్బ సౌభద్రునిదని చెప్పకయే చెప్పుచున్నది.

(మూర్ఛిల్లి మఱల లేచును)

ద్రోణ— అబ్బబ్బ! దెబ్బలికిఁ వొరకు కురంగమైతినిగదా:

అశ్వ— ఛీఛీ మనబలశౌర్యము లేమిటి? (ఒఱిగి మఱల లేచును)

కర్ణ— (రహస్యముగా)

ఉ॥ కౌరవ యోధులార! వి • శిఖంబులకున్ భయమొందిపాఱున
ట్టీరణభూమిదాటి వెను • కేగిధనస్సును ద్రుంతుమీరు నీ
వీరుఁడునన్నుఁజూచుచును • పేశరవారపరంపరన్ ద్వరన్
సారథిరథ్యముల్ త్రుటిని • జంపుదుమంచు నిజంబుఁజెప్పినన్॥ 41

యోధులు—పోపొమ్ము, లై చేయుదుము.

అభి— గీ॥ ఏమిరా! నూతజానీక • నామహాచ్ఛ
రాళిఁజవిఁజూపవలెనె? తి • రంబునిలుము
యూరకే నినుఁజెంచెడి • వారుజూడ
బంపుము నిపుడునిన్నుని • లింపపురికి॥ 42

(అని యొకబాణమునేయ నాతఁడుపాఱిపోవును);

కర్ణ— (అభిమన్యు కౌరవులు పోరుచుండ వెనుకఁ బ్రవేశించి) నేనిదే వీని ధనుః
కాండము తెలియకుండఁ గొట్టెదను (బాణమువేయ ధనుస్సు విఱుగును)

అభి— (ఆశ్చర్యముతో వెనుకకు దిరిగి) ఏమిది. ఛీఛీ మహాత్మా!(అని యనుసరికో
ద్రోణాది యోధప్రయుక్త బాణములచే సారథి రథము రథ్యములు నేలం
గూలును) ఛీఛీ దురాత్ములారా! (అని యంబరమునకు నొకకత్తితో నెగిరి(
గీ॥ ఆఁడువారికి లేని భ • యంబుఁజెంది
సంగరాచారములనన్ని • ద్రుంగఁజేసి
సారథంబును భగ్నంబొ • నర్చినట్టి
తుచ్ఛులార! నిలుండాజిఁ • ద్రుళ్లడంతు. 43

(అనిచిత్రగతుల నంబరమున నేతిరుగును.)

దుర్యో— గీ॥ అయ్యొ నామీఁదఁబడి వీఁడు • హతముజేయు
కర్ణ— విల్లుఁద్రుంచుమ ననుజంపు • మేగమితఁడు
అశ్వ— చాపఁడంచుదయార్ద్రితఁ • బడయుకన్నె?
శల్య— బాబో నాప్రాణములకాశ • వదలుకొంటి.

(అనిభయార్తులై పరువులిడుదురు.)

ద్రోణు— శభ్భా! ఎగిరిపడియెదవేల! ఇదిగో నీవాలువ్రాలును.

(అనియాతని ఖడ్గమును బడఁగొట్టును.)

అభి— (తన విఱిగిన రథముపైనున్న గదతో నంబరమునకేగి)

క॥ ఓరీ! మూర్ఖుఁడద్రోణా!
నీరాజానీకమడఁగు • నిక్కము నాచేన్
బోరన్ నిమేషసంబాగుము
నీరధిగంభీరుఁడితఁడు • నీచేఁబడునే?

(అనిభూమికిలంఘించును.)

వైశ్వాసని- (సమీపించి)

క॥ రాఁగదరా యిటువేగమె
సాగదరా యిపుడునీకు • నాకముజూపన్
సాగదురమ్మిఁకటుమదకున్
సాగదురమ్మిఁకఁచటియాట • చక్కఁగనీకున్. 46

అభి— క॥ నాకదనంబున నీచే
నాకదనంబుగనిలంగ • నవ్వరెనన్నున్
నాకుల మేసరియానెడ
నాకులమొందించినిన్ను • నక్కడదృంతున్, 47

(ఇద్దరుకొంతతడవాలము జేసి భూమికివ్రాలుదురు.)

దుందుభుల మ్రోతతో యవనిక జారును.

ఇది ప్రథమాంకము.





ఓమ్.

శుభమస్తు.

# సైంధవార్జునము.

## ద్వితీయాంకము

ప్రదేశము—ధర్మరాజసభ

ప్రవేశము—ధర్మరాజ భీమాదియోధులు దుఃఖాక్రాంతులై

ధర్మ— హా! హా! లోకైక ధనుర్ధరా! వీరాగ్రగణ్యా! అయ్యో ముద్దుకుఱ్ఱ! పదియారేండ్లకే ముదిసిన ప్రాణినైతివా?

సీ॥ నినునమ్మికొనియున్న ♦ నీతండ్రులగుమాకు
నేదారిఁ జూపినీ ♦ వేగినావు
కడుపార నినుఁగన్న ♦ పడతిసుభద్రకుఁ
బుత్రశోకంబెట్లు ♦ పోవునయ్య?
నిను దైవముగ నెంచు ♦ వనితయుత్తరనీవి
యోగమునెట్లింక ♦ నోపఁగలదు?
నినుమూలముగ నెంచి ♦ కొనివృద్ధిఁగనఁజూచు
భరతవంశమెటు ని ♦ ల్వంగఁగలదు?
గీ॥ అక్కటా యిందఱికిని ♦ నొక్కపరుస
మాఱుచెప్పకేముందుగా ♦ జాఱినావె?
దైవమైనను నీపైని ♦ దయఁదలంచ
లేకపోయెనె లోకత్ర ♦ యైకశూర!!.

అకటా! యీదుఃఖమాపఁజాల నేనేమిసేయుదుఁ. దమ్ముఁడర్జును మోమెట్లు చూచువాఁడ?

గీ॥ ముద్దుగారెడి సూనుని • మూఢబుద్ధి
మొగ్గరంబులోనికిఁబంపి • మోఱకులగు
వారిచేతఁజంపించితి • పోర నేను
సుతవియోగార్తుఁడర్జునుఁ • జూడఁగలనె? 2

(అని తలఁగొట్టుకొని యేడ్చును)

భీము— (భోరని యేడ్చుచు) అయ్యయ్యో! అన్నయ్యా! వాని చావునకు నేనుగాని మీరుగారు.

చ॥ వెనుకనె యంటివత్తునని • వీరను లెన్నియొ పల్కి సైంధవున్
గెనకఁగలేక చచ్చునయి • చిత్తమునందొక యింతయేనియున్
మనసుతుఁడంచు నెంచకయొ • మార్తురకిచ్చితి నేనెయింతకున్
ఘనమగు కారణంబకట! • కాల్చనె నాభుజశౌర్యసంపదల్॥ 3

హాహా! పితృవత్సలా! అయ్యో విజయైకపుత్రా! నేనటుల చెప్పకుండినను నీకంత మూడకుండునేమోగదా! ఇఁక నెట్లు కృష్ణార్జునులఁజూడఁగలను? నాకడుపుచెరువగుచున్నది. నేనీదుఃఖాంభోనిధినోలలాడఁజాలహా ముద్దుకుఱ్ఱ!

గీ॥ ఏఁడి నాపుత్రుఁడెక్కడ • నే గెనంచు
నధికవాత్సల్యమునఁజూడ • నభిలషించు
నీదు తండ్రికి దుఃఖంబు • నివ్వటిల్ల
నీవి బైతివటంచేమి • నేవచింతు?॥ 4

(అని యేడ్చును)

దృష్ట— మాన్యులారా! శత్రువులఁ జెండాడి వీరోచితంబైన మరణంబు నొందినవానికై యిట్లు వాపోవఁదగదు. రణములో జయమిద్దరికిని రాదుగదా? కృష్ణార్జునులు మాత్రమంత యెఱుంగని వారలా కావున మీమీశోకంబులోదార్చుకొనుఁడు.

ధర్మ— అయ్యయ్యో! బావ!

ఉ॥ మారసమాన తేజు సుకు • మారశరీరుఁ ద్రిలోకశూరునిన్
మేరుధరాధరాభధృత • మేఘనినాదవరస్వనున్ ధరా
భారవిమోచకాతిచణు • భారతవంశసుదీపకున్ ముదం
బారఁగఁ బెంచుకొన్న సుతు • నయ్యయొ చంపుకనిల్వలేమహా॥ 5

(అని యేడ్చుచు) హా! నవమోహనాకార! హా! శశిరేఖాప్రియా! నిన్నే మని మఱచిపోదమురా కుఱ్ఱా! నాకీశోకమెట్లు పోవునురా నాయనా! అబ్బ! నీసుందరవదనారవిందము గపఱచవేమిరా పుత్రా! పుత్రా! పుత్రా! అయ్యో తమ్ముఁడా అర్జునా నీ ప్రేమానిధియడుగంటినది. నీముద్దులమూట దొంగలింపఁబడినది అయ్యో మనవంశవృక్షము ఛేదింపఁబడినది. ఇఁక నేమున్నదిఁక నేమున్నది. కొమ్మలులేనిపాండవ వృక్షము మిగిలినది అయ్యో! కృష్ణభగవానుఁడా! నీచెల్లెలు సుభద్రనేమని యూరడింతువు? నాకేగతిఁజూపెదవు? అయ్యయ్యో ఇఁక నేవారిమొగంబులఁ జూడఁజాల హా! విజయాత్మజా! హా కౌరవసైన్యాటవీదవానలా! హాహా కురుయోధజీమూతమారుతమా! ఎక్కడడాగితివి. 'మాకేది తెరవుజూపుదువు నిన్నే దైవముగా నెంచు గర్భాలసయగు విరాటపుత్రి కేమనిసమాధానము చెప్పుమంటివి? నీతల్లి సుభద్ర నేమని యూరడింపుమంటివి? అయ్యయ్యో! కుఱ్ఱా నీకెట్టిపాటు తటస్థించినదిరా! బాబా!

సీ॥ ముద్దుగారెడి నీదు ♦ మోముఁజూడక యున్న
నిముసంబు నేనెట్లు ♦ నిలువగలను?
నీతోడిలోకమై ♦ నినుఁ గాంచు నీతండ్రి
కేమంచు నివ్వార్త ♦ నెఱుఁగఁజేతు
నీతోడరాలేక ♦ నినుఁజంపికొంటిమం
చేడ్చునీ యోధుల ♦ నెట్లు తేర్తు?
శోకాంబుధిన్ మున్గి ♦ శోషిల్లునీబంధు
వుల నెట్లు నేనింక ♦ బోధసేతు?
గీ॥ హా సుభద్రాసుతా! విజ ♦ యప్రమోద
చండరిపుభీకరా! ముఖ ♦ చంద్రుఁజూప
వేర రావేర! యోదార్ప ♦ వేర నన్నుఁ;
గాఁగిలియ్యవదేర ♦ యోకంజనయన! ॥ 6

(అని మూర్ఛిల్లును)

భీము— (ఇదివఱకు దుఃఖాంబుధిని మగ్నుఁడై) హా! యభిమన్యూ! నీకెట్టిపాటు వచ్చినదిరా బాబూ! అయ్యో మాకన్నముందుగ నీవే స్వర్గముఁజూడఁబోదలంచితివి

రా! నాయనా! కాలమా! యెంతవిపరీతమైతివె! కృష్ణా! త్రికాల వేదివి నీకైనఁ దెలియలేదా? తెలిసిన నుపేక్ష సేయుదువా! నీకుమాత్రమల్లుఁడు కాఁడా? అయ్యో! ఖేచరులారా! మీరైన నెఱుంగరో? యర్జునుతో నుడవలేక పోతిరా? చెప్పిన రాలేకపోవునా యాతఁడు వచ్చిన నింతమూఁడునా? అహా హతవిధీ! యెంతదలఁచితివి! ఆహా పసికూనా!

గీ॥ సంగరాంగణంబుచ శత్రు • సైన్యములను
నోడఁబుచ్చి నీతోడ మ • హోన్నతదశ
నందుదుమటంచు నెంచితి • నంతెకాని
యిట్టుకడ తేలుదువటంచు • నెఱుఁగనయ్య॥ 7

(అని మూర్ఛిల్లును)

ధృష్ట— అయ్యో! వీరలందరు పుత్ర వాత్సల్యమున నెంతయు దురపిల్లుచున్నారు. ఏమి సేయుదు? నాకు నింతగా దుఃఖము గలుగఁజేయుచున్న యతఁడు వీరినిట్లో నర్చిన వింతయేమున్నది? ఇఁక నర్జునుఁడే విన్న యెడల నేమి జరుగునో కదా! కృష్ణుఁడే తెంచినఁగాని వీరి ననునయించుట సాగదు.

(అంతఁ బాంచజన్య దేవదత్తములు వినంబడును)

ధర్మ— అయ్యయ్యో! పాంచజన్యదేవదత్తములు వినంబడుచున్నవి, నీతో యుద్ధము లోనికిఁ రాలేకున్నను స్వర్గమునకును రాలేకపోదునా కుమారా! నాకెంతవంత గల్పించితివిరా బాబు. వారల మోములెట్లు జూడఁగలను? (అని యేడ్చును)

(అంతదూరమున ద్వారముకడ కృష్ణార్జునులు ప్రవేశింతురు)

అర్జునుఁడు-బావా! వాసుదేవా!

ఉ॥ ఏమిది నామనంబిపుడు • హీనతఁ బూని తిరంబులేకయే
వేమరుఁ గొట్టగాడెడి • వివేకము గూడ నశించుచుండె సం
గ్రామమునందు డస్సినటు • గాదనుపున్ వడఁకన్ దొడంగెనీ
భూమి నెమూడ వింత తల • పుల్ పొడసూపుచునుండు నామదిన్॥ 8

కృష్ణా— ఏమిది యర్జునా! యిటులనుచుంటివి? సకేమి భయమా!

అర్జు— ఎగతాళిఁ గాదు బావా!

క॥ ఎన్నో యపశకునంబులఁ
గన్నారంగాంచుచుంటిఁ • గంజనయనా

యన్నలుఁదమ్ములకట యె
ట్లున్నారో తెలియరాదు ♦ యూహింపంగాన్॥

కృష్ణ— అర్జునా!

ఉ॥ ఏటికి నిట్టివింతలిటు ♦ లెంతయు వంతలనొందనానె? నీ
బోటి మనోబలాఢ్యునకుఁ ♦ బోలునెయిట్టుల దుర్నిమిత్తముల్
పాటిగఁదెచ్చుటల్? మనసుఁ ♦ బట్టగలేవటె? మాటిమాటికిన్
లేటమొగంబుఁ జేసుకబ ♦ లే తిఱుగాడఁగ నానెపార్థివా!॥ 10

అదియుఁగాక.

గీ॥ అతిబలాఢ్యులైనట్టి నీ ♦ యన్నదమ్ము
లకు సుఖంబుగలుగకున్నె? ♦ యకట యేదొ
యొకచిఱుతనష్టము గలుగ ♦ నొకటికలుగుఁ
గాక దానికైయింత శో ♦ కంబదగునె?॥ 11

అర్జు— (మఱింతయధైర్యముతో) కృష్ణా! నాకేమియోకాని యట్టి వైర్యముండకున్నది నాకేదియోగొప్ప యాపత్తు సూచించుచున్నది. ఇట్టి నామనస్తాపమునకుఁ గారణముండకపోదు.

(పరిక్కులఁపరికించి) ఇదియేమికృష్ణా!

సీ॥ వందిమాగధులేల ♦ వనటబొందినయట్లు
స్తోత్రపాఠములేక ♦ తొలఁగుచుండ్రి?
బ్రాహ్మణవ్రాతంబు ♦ పాపంబు నామోముఁ
జూడనొల్లనియట్లు ♦ చూచుచుండ్రి
పరిచారకులిదేల ♦ పాడువార్తలనేవొ
చెప్ప నొల్లనియట్లు ♦ తప్పుకొనిరి?
శిబిరంబుఁజూచిన ♦ శిధిలమైనటులుండె
చేటుగాలమదేదొ ♦ చెప్పఁదొడఁగె

గీ॥ సంజ వేళయానంతనె ♦ చఱచఁబడెడి
భేరి ఢక్కా నినాదంబు ♦ వినఁగఁబడదు
యిట్టి వస్థయుఁజూడనే ♦ నిష్ఠధర్మ
జాదుల విషయమై శంకి ♦ తాత్ముడగుదు॥ 12

కృష్ణ— (తనలో) అయ్యయ్యో! నన్నే యట్టుల దుఃఖవార్ధిలో ముంచుచున్న నీ వింత బాలీతనికిట్లుండుట వింతగాదు. నానోట నే యితనికిఁ జెప్పలేను ధర్మజుఁడే చెప్పఁగాక. (ప్రకాశముగా) అర్జునా!

అర్జు— ఏమి యర్జునుఁడింక రానురాను నాకు మఱింత వంతదొంతరెక్కుచున్నది! కృష్ణా! (విచారముతో)

గీ॥ మనలదేవదత్తధ్వని • వినినతోడ
నెదురువచ్చెడు సుతుఁడేల • యెదురురాఁడు
వాని సేమమ్మయున్ననా • వీనులిపుడు
నెట్టిఘోరవార్త వినునో • యెఱుఁగనకట!॥ 13

కృష్ణ— ముందెందులకీ చింత లోనికిఁబోయి ధర్మజునడిగి తెలుసుకొందము. రారమ్ము.

అర్జు— అయ్యో నాకాళ్లాడకున్నవి.

క॥ ఏవానిన్ నేనెప్పుడు
బూవున్ బలెఁజూచికొంచుఁ • బూనికఁ బెంతున్
దేవా! వానికి నేఁడో
దైవంబోర్వకయె సల్పఁ • దాళఁగలానే॥ 14

(అని చలికిలఁబడును)

కృష్ణ— ఏమిది యర్జునా నిజము తెలియకెట్లు దురపిల్లనగునా? జేలవగుచుంటివిసుమా

అర్జు— ముకుందా! ఏమిది నాదుఃఖమునకంతయుఁ నాయనుంగు కుఱ్ఱఁడే మైనచో నాబ్రతుకెట్లు? నాకాళ్లు తడఁబడుచున్నవి. కృష్ణా నేను లోనికి రాలేను

కృష్ణ— అయ్యో నీవట్లధైర్యపడనగునా?

(అని యర్జును జూచునంతనే గొల్లని యేడ్చుచు మొగములు దిగవాల్చిన యోధులమఱందున దీసుకేగును]

అర్జు— [సమీపించి దుఃఖాతురముతో జలికిలఁబడి]

ఉ॥ అక్కట వీరలందరును • నాననముల్ దిగవ్రాలవైచినా
పక్కికఁజూడ కేద్వసమ • రంబున నాదగుముద్దుపట్టి తాఁ
జిక్కెనటంచు నిక్కమది • నీ! యిఁక నెందుల కయ్యజీవముల్
దక్కుదువయ్యయాపరమ • దాష్ట్యనకున్ విజితారి పుత్రికా॥

(అని మూర్ఛిల్లును)

ధర్మజభీములు—హా! హా! యభిమన్యూ (యని మూర్ఛిల్లుదురు)

కృష్ణు— (దుఃఖమాపుకొనలేక యర్జునుమీఁదఁబడి) హా! హా! సుభద్రాసుతా! హా! త్రిలోకశూర! హా! పితృవత్సలా! హా! హా! యభిమన్యూ నీకెంతగతి పట్టినదిరా కట్టా! అయ్యో! యర్జునా నీకీపుత్రశోకంబబ్బదను కొంటినోయి. అయ్యయ్యో సుభద్ర నేమనియూరడింతును. అబ్బబ్బ శశిరేఖా నీపాట్లు నేనెట్లు జూడఁగలను? ఆహా! ఆనాటి వివాహపుఁబోరే యింత దెచ్చి పెట్టినదా! అర్జునా నీవింత శోకంబులో మునుంగ నారాతిగుండెయుం బ్రద్దలగుచున్నది లేలెమ్మిఁక నోర్వలేను. క్షత్రియుల కిట్టివి తప్పవు. (అని యేడ్చును).

అర్జు— (మూర్ఛదేరి) హా! హా! నాకుమారా! నీకెంతలోఁగాలమైనదిరా పుత్ర! తండ్రీ నేనెట్లు బ్రతుకఁగలను నాకేదిదిక్కు?

సీ॥ హాకుమారా నీదు • రాకేందువదనసం
దర్శనంబునఁగాక • తాళఁగలనె?
హా! పుత్రకా నాదు • పాపంబుచే నీవె
ముందుగా నాకంబు • నందితయ్య
హా కుట్టి! నీవేవో • నాకుద్ధరింతువం
చెంచితిఁగానియి • ట్లెంచనయ్య
హా! ముద్దుపట్టి నీ • యమ్మనీకై యేడ్వ
నేనిజూచుక యూర • డిల్లమందు?
గీ॥ హా! కొడుక! నినుఁజూచి మే • సుందఱమును
బ్రతుకుచుండఁగ మాలదై • వంబు నిన్ను
యెగురవైచుకపోయెనే • తగునటంచు?
నేమి నేయుందు నింకనా • కేదిదిక్కు? 16

(అని తలగొట్టుకొని యేడ్చును.)

కృష్ణు— అయ్యయ్యో! అర్జునా! ఇంత కడుపు పగుల దుఃఖించుట తగదు. శత్రువీరులఁ జెండాడి క్షత్రియోచితంబైన మరణంబు నొందినాఁడు

(ధర్మజునివైపుఁదిరిగి) రాజా! నీవునిట్లువాపోవనగునా లేలెమ్ము నీయర్జునుఁ జూచికొనుము.

అర్జు— కనుపు పగులుచునేయున్నది. దుఃఖమెక్కడిది? నాగుండె రాతిగుండెకాని మంటిమియుఁ గాదు. హాకుమారా! త్రిలోకశూర!

సీ॥ క్రేవులుమాలలా • బెడిదంపురక్తంబు
గంధమానీకు • నోకమలనయన
కాకియేకీరమా • ఢాకినీభూతముల్
దాసీజనంబులా • భాసురాంగ!
శిరములేయుపధాన • వరములానీకు ర
క్తాలియే దీపమా • యచలధీర?
ఛత్రముల్ పువ్వులా • చిత్రమా మొండెముల్
మురిపెంపుఁపటములా • ముద్దుకుఱ్ఱ
గీ॥ మాంసమస్తిష్కపేశల • మహియెనీకుఁ
బట్టుపరుపుల మెత్తని • పాన్పుఁటోయి
శత్రుభీకర మానీదు • సమరధర్మ
మనెడిభార్యతోడ సుషుప్తి • నందితయ్య॥ 17

కృష్ణ— అర్జునా! ఏటికీ వెఱ్ఱితలంపులు లేచి నీయన్నదమ్ముల నూరడింపుము

అర్జు— అయ్యో! మమ్ముండఱిని నాముద్దుకుఱ్ఱండే యూరడించినాఁడు మాగొంతె మణోర్కులన్నిటి కంతము జూపి మమ్మీతీరున నన్నుఁగలసికొమ్మని యూరడించితివిరా? తండ్రీ.

చ॥ నిను నరగంటయైనవిడ • నేరని నీదగు భార్యనుత్తరన్
ఘనమగుశోక వహ్నిమలు • గన్విడితేయకటా యరాతిశో
షణచణ! నీదుతల్లిసుత • సంప్రదలేమిని దీసఁజేసితే?
రణమహినీసు దేహము ది • రంబగు బూడిద దోఁగియున్నదే?॥ 18

అయ్యయ్యో అన్నయా! ధర్మజా మనలనందఱి గోతిలోనికిఁ ద్రోసి స్వర్గమున కేగిన నాముద్దుకుఱ్ఱఁడెట్లు తలఁచ కొలఁదికిమా కొన్నో తెలుపవా?

ధర్మ— అర్జునుఁ గౌఁగిలించుకొని యేడ్చుచు)

గీ॥ గురుఁడు పన్నినతమ్మిమొ ♦ గ్గరముఁ జించు
వారిఁ గానక యభిమన్యుఁ ♦ బంపి నేనె
వానిఁ జంపించితినిగటా! ♦ పార్థ నేఁడు
పుత్రఘాతుకుఁడేన నూ ♦ పుడమిని పుడు॥ 19

అర్జు— హా! పుత్రా! హా! యభిమన్యూ! త్రిలోకవీరుఁడవయ్యు నెట్టి యిక్కట్టులఁ బాల్పడితివిరా తండ్రీ! నీకుఁ దమ్మిమొగ్గరముఁ జించుటయే కాని వెడలి వచ్చుట చెప్పలేక పోతినిరా బాబూ! నేనే యింతటి పాపమునకొడిగట్టితిరా నాయనా! నేనేమి సేయుదురా బిడ్డా! నాకీదుఃఖమెట్లు పోవురా నాయనా! నేలేనని యెంచియే యీవ్యూహము పన్నఁబడినదిరా! తండ్రీ!

క॥ కట్టా ద్రోణుండా! నా
పట్టికొఱకె పన్నితయ్య ♦ పద్మవ్యూహం?
బెట్టుల మనసొప్పెను నీ
పట్టికొఱకె యింత సేయఁ ♦ బాడఁడవుకదే॥ 20

కృష్ణ— ధర్మరాజా! నీవట్లనుట తగునా? నీవేమి చేసితివి? కాని మన భీమాదుల వెంటనరిగిరా లేనేలేదా?

ధర్మ— ఉ॥ ఏమని చెప్ప? సంగరమ ♦ హీస్థలినట్లభిమన్యుఁడక్కటా!
యా మొనఁజించిలోనికి మ ♦ హాద్భుతమారఁగఁ బోవ వెంటనే
మేముఁ జనంగ మధ్యమున ♦ మించినవిక్రమ మొంది సైంధవుం
డేమియొకాని యడ్డుపడి ♦ హీనులఁ జేసెను మమ్మునందఱన్॥ 21

అర్జు— (దుఃఖముతోఁ గూడిన మహోగ్రాగ్రహముతో) ఏమేమి? ఎంతపని జరిగినది ఓరోరి సైంధవ ఛండాలా! ఎంతఁ జేసితివి! ఓహో! అగ్రజా ధర్మజా! కృష్ణ భగవానుఁడా ఓపంచభూతములారా!

మ॥ వినుఁడీ నాదు ప్రతిజ్ఞ సైంధవుని నే ♦ వీరుండు రక్షింపగాఁ
జనినన్ భీకరసంగరాంగణమునన్ ♦ సర్వారి వీరుల్కనుం
గొనఁగా సూర్యుఁడు రేపు గ్రుంకుమును పే ♦ క్రూరంబుగాఁ జంపుదున్
గానరన్ జేయనిచో, ధనూవరముతో ♦ బూదైపోదును గ్రిగ్గి లోన్

(ధనుష్టంకారము చేయఁను తోడనే భేరీఢక్కానినాదములు వినంబడును.)

కృష్ణ— అర్జునా! నీప్రతిన మఱొకలాగగునా?

అర్జు— సాక్షాత్పరమేశ్వరుండవైన నీవుండ నాకేటికిబావా?

కృష్ణ—ధర్మరాజా! మేముపోయి సుభద్రాదుల నూరడింతుము సెలవా?

ధర్మ— మహానుభావా! చిత్తము.

(అని యందఱునిష్క్రమింతురు)

ఇది ద్వితీయాంకము.





ఓమ్.

శుభమస్తు.

# సైంధవార్జునము.



## తృతీయాంకము.



ప్రవేశము—సుభద్రాంతఃపురము

ప్రవేశము-సుభద్రార్జునులు కైదండఁబూని తోడనే కృష్ణుఁడు

సుభద్ర—(ఏడ్చుచు) ద్విపద.

ప్రాణేశ మురిపెంపు • బాలునివీఁడి
ప్రాణంబు నిల్పంగ • వశమానె మనకు?॥ 1

అర్జు— (ఏడ్చుచు)కాంత! దురంతశో • కంబునమున్చి
యంతంబుఁజేయంగ • నబ్జజుఁడెంచె॥ 2

సుభ— ఏడఁబోతివికుఱ్ఱ! • ఏలమాకడుపు
మాడఁజేతువురార! • మారశరీర!॥ 3

అర్జు— పృథివీతలంబేలి • పేరొందెదంచు
విధువంశదీపక • వెఱ్ఱితోనుంటి॥ 4

సుభ— అయ్యయ్యో నాపుత్ర! • యరిసంఘమలరఁ
జయ్యనంబోదువే • స్వర్గంబుఁజూడ॥ 5

కృష్ణ—(కన్నీరుఁదుడుచుకొనుచు)
అమ్మ! సుభద్ర! నీ • యాత్మజుఁడరులఁ
గిమ్మన నీకచె • క్కిదివంబుఁబోయె॥ 6
వానికై యిట్లెంతొ • వందురఁదగునె?
ఊని బిడ్డలకిట్టి • క్రియకాదెకీర్తి॥ 7

అర్జు— కాలంబ మాపైనిఁ • గక్షగట్టఁబసి
బాలుఁడె దొఱకెమా • ప్రాణాలు లేవె?॥ 8

సుభ— మా ప్రాణములకన్న • మక్కువఁజూపు
పాపనిఁజంపదై • వంబెట్లు కడఁగె?॥ 9

కృష్ణ— గీ॥ అమ్మ! దేవుఁడుచంపెనం • చనగఁబోకు
వానియాయువు మూఁడిన • వాఁడువోవు
బోవుచు విమలకీర్తిని • బొందినాఁడు
పోవువానితో మనయును • బోవుటున్నె?॥ 10

కావున నీవలవంతఁ దక్కి కొండంతభారము మీఁద వైచుకొనిన నీమగని నోదార్పుము. అదియుఁగాక క్షత్రియకాంతవైన నీవిప్పుడు సంతసింప వలసిన సమయమేయిది! ఏలయనిన.

ఉ॥ సంగరమందు శత్రువుల • సర్వసుపర్వులు హాయిహాయనన్
రంగదఖండితాశుగ ప • రంపరఁగుయ్యిడఁజేసియే గనో
యంగన! సీతనూజవరుఁ • డట్లగుటన్ దగవీరమాత వై
భంగితశత్రుఁడైన నరు • భామినివైతివి చింతయేటికే?॥ 11

కావున నీవెడగు చింతలుమాని ధైర్యము వహించి కించ నొందక నామాట విని నీమగనినోదార్పుము.

సుభ— (ఏడ్చుచు) అయ్యయ్యో! అన్నయ్యా!

ఉ॥ యెవ్వని మోముఁజూచుకమ • హీవరులందఱు యుద్ధరంగమం
దవ్విధి నిల్చిరో యెవని • కైవసుధాసతి వేచియున్నదో
యెవ్వనితోడి లోకమయి • యుండఱుముంటిమొ యట్టిపట్టియే
చివ్వునఁబోవ ధైర్యమఁట • ఛీయిఁక నెందులకయ్యజీవముల్॥ 12

అర్జు— హా! సుభద్రాకుమారా! ఆహా శశిరేఖాప్రియా! అయ్యోనాయనా చతురుదధిపరీత ధరావలయం బేలుదువనుకొంటి గాని యింతలో నంతముఁ జెందుదువనుకొనలేదురా తండ్రి! పరమనిర్భాగ్యులమగు మాకేల పుట్టితివిరా! ఇఁక నెవ్వరికైన బుట్టిననీపాట్లు తప్పిపోవునేమో కదరా పుత్రా! ఆపాడుపద్మవ్యూహమేటికి నాబ్రాహ్మణ ఘాతకుఁడు పన్నవలె నీసైంధవ చండాలుఁడేటికి మనవారి నిలువరింపవలె?

సుభ— (దుఃఖాతురయై) నాకడుపుఁ దరిఁగోయుచున్నది నాయనుంగుకుఱ్ఱా! నన్నే మని యూరడిల్లు మందువు నాకేది తెరవుజూపింతువు? నేనెట్లింకఁబదిమంది లోఁ దిరుగాడఁగలను? నాముద్దుముచ్చటల నేరుదీర్తురు. అయ్యయ్యో! మా వంశమునకు మొలకయేది? అబ్బబ్బ! యీదుఃఖమాపుకొనఁజాల! అన్నయ్యా! నీవేదియో త్రికాలవేదివనుకొంటిని నీకైనఁదెలియలేదా! ఆహా! హా! నా కుఱ్ఱను రక్షింప లేకపోతిగా; నాకడుపు చెఱువగుచున్నది అహా! నాబిడ్డా! ఎక్కడకుఁబోతివి. ఇఁక నేడియో యుత్తరమాకొక కొమ్మఁజూపుననుకొం టిమి అదియేమాకు దిక్కైనదా ?

కృష్ణ— అమ్మా! సుభద్రా! ఏటికీ వెర్రితలంపులు! నీకురిని కాయువుమూఁడి నఁనాపఁగలవారుండిన నేమిసేయుదురు! ఇఁకనైన నీదుఃఖము మానుము. ఉత్తరాగర్భమే మనకేడుగడయను కొనవలసివచ్చినది. ఉన్నంతతో సంత సింపకపోయిన వారినితోఁబోవుట లెక్కడనైనవుండునా ? అర్జునా? కర్త వ్యాంశము మఱచి ప్రాకృతునిఁబోలి దుఃఖాక్రాంతుఁడవై యేలదురపిల్లె దవు. క్షత్రియకులమందుఁ బుట్టుపరితినరునకునిట్టివితెప్పవుకదా? అదియుఁ గాక క్షణభంగురములైన నీదేహములకై యిట్టివలవంత బొందఁదగదు సుమా! ఏదియెట్లున్నను గులాచారము మఱువనగునా ? యుద్ధరంగమం దెల్లి నేమిజరుగవలసియున్నదో యోచించి తత్కార్యనిర్వాహనమందాస క్తియుండు టొప్పుఁగాని యిట్లుపోయినవానికై యూరక వాపోవఁద గునా ! ఏడ్చినలాభమున్నదా ! అమ్మా ! సుభద్రా ! నీకేమివెర్రి ! ఇంక నిల్లెందులకేడ్చెదవు ? ఏడ్చిననీకురిని సంపాదింపఁగలవా ? లేలెమ్మా కన్నులఁ దుడిచికొనుము. దివ్యమంగళవైన నీమగనికేఁపటి విజయమునకై నీయిష్టదైవతముఁబ్రార్థించుము నీమగనిబాగే నీబాగు-శుచివగుము లేలెమ్ము. అర్జునా! యుద్ధప్రారంభమందు నాచదివిన చదువుల నట్టేటఁగలిపి తివా? లేలెమ్మా- యూరకవాపోవ లాభము లేదుసుమా !

అర్జు— బావా ! దుఃఖమేలేదు. హృదయము బాయియై యేదుచున్నది నాముద్దు బిడ్డఁడెప్పుడునన్ను వదలెనో యప్పుడే నిశ్చలమైనది. కర్తవ్యమున కేను న్నది. శత్రుఁడైనఁ బావవలె నేనైనఁగావలె

(తెరలో)

గీ॥ పాఱిపోవంగనీకేటి ♦ భయముచెపుమ ।
కర్ణుఁడాదిగాఁగల్గుయో ♦ ధార్ణవంబు ।
దాటఁదరమెళివునకుఁబో ♦ రాటమందు ।
నభయమిచ్చితిలెమ్మిఁక ♦ నడలనేల ? ॥ 13

అర్జు— బావా ! యీకంఠస్వాన మెవరిదియైయుండునో ?

కృష్ణు— ఇఁక నెవ్వనిది. ద్రోణునిదే! సైంధవునికేయభయమిచ్చి నట్లగపడుచున్నది.

(మఱలఁదెరలో)

దేవా !మనవార్తావహుఁడు చారిత్రుఁడు ద్వారముకడ వేచి యున్నాఁడులో నికి సెలవా ?

అర్జు— వేవేగప్రవేశపెట్టుము. దేవీ ! యుద్ధపరిచారము వినఁగూడని నీవులోనికిఁ బొమ్ము.

సుభ— చిత్తము (నిష్క్రమింపఁగాఁ జారిత్రుఁడు ప్రవేశించును)

చారిత్రుఁడు-జయము జయము భూపాలచంద్రా !

అర్జు— చారిత్రా ! విచిత్రంబు లున్నవియా ?

చారి— దేవా ! రోదనంపుఁగౌరవశిబిరమురనుండి యేతెంచుచుంటి.

కృష్ణు— రోదనమేలరా వారికి ?

చారి— వారికిఁ గలిగిననేటి విజయమే కారణము.

అర్జు— అదెట్లురా ?

చారి— గీ॥ మోసములుజేసి జయమును ♦ బొందినట్టి ।
కౌరవులకు భవద్దివ్య ♦ గాండివపరి ।
యుక్తశరవర్షభయమింత ♦ యుండఁబోదె ? ।
గర్భనిర్భేదములగువా ♦ క్యములవినరె ? ॥ 14

అర్జు— (విచారసూచకముగా ఆపైనసస్మత్కుమార భానుఁడ స్తమించిన దాదినే మి జరిగినదో సవిస్తరముగా విన్నవింపుము.

చారి— దేవా ! అవధారు. అట్లుదౌశ్శాసన్యాభిమన్యకుమారు లిరువాగువారచ్చె రువడిచూడ, వినూన చారులెల్లరు నుక్కుమీఁద వ్రేలువై చికొని యుప్పై

యాశ్చర్యపడ, స్వర్గపుర కాంతలురారమ్మనిపూలమాలికలెత్తినిలువఁ బోరిపోరి, వీరోచితమగు, విజయశ్రీ గ్రహించి, దివినలంకరించిరి.

కృష్ణ— తరువాతఁ దరువాత

చారి— దేవా! అదేమి సంతసమోకాని కురురాజాది ధార్తరాష్ట్రులెల్లరుతమసుతుడనిఁ బడెనని యావంతయు, విచారింపకయే, తుచ్ఛవిజయ మొందితిమి కదా, యనినైన సిగ్గులేక, చంకలెగురవేయఁ దొడంగిరి.

కృష్ణ— సంతసము గాకేమిరా వారికి ?

గీ॥ కురుకులబలాటవీదవా • నలుఁ డనిమిషు ।
దుర్నిరీక్ష్యశరాసన • దోర్బలుండు ।
మీఁదఁబడి చంపఁగానుద్య • మించుసింగ ।
మను సురపురికినంపిన • ముదముగాదె ? ॥ 15

అర్జు— తరువాత.

చారి— తరువాతనోదేవ! ద్రోణుఁడుతానే యీమోసమునకుఁ గారణమనియో లేక దేవరకిది యెట్లును తెలియకపోదని భీతియో, కాక కుమారునిపై సహజప్రేమయోకాని, సైన్యమునకు ముందుగానే, ఖిన్నుఁడై తనరథముఁద్రోలించుకొనిపోయె. అశ్వత్థామయు, వెంటనంటె. కృపుఁడు గోడమీఁది పిల్లివలె, గజతండములలోఁ బడిపోవుచుండెను.

కృష్ణ— మోసములు జేసితిమని, పశ్చాత్తాపమై యుండవచ్చును.

అర్జు— గురుపుత్రు లిద్దరిట్లు పోవుటజూచి కౌరవులేమైన ననుమానించలేదా ?

చారి— అనుమానించక పోవుటకుఁ గర్ణుఁడులేఁడా ? అవధరింపుఁడు. అట్లుపోవుచున్న ద్రోణాశ్వత్థాములు వినునట్లు కర్ణుండురారాజుతోనిట్లనియె.

శా॥ కంటే ! మిత్రమ బ్రాహ్మణత్రయముసం • గ్రామంబులోనీజయం ।
బుంటన్ జూడఁగలేకయో నరప్రితా • పోత్తాపభీతార్తితో ।
గంటుల్ వారినదేహబాధవలనో • కష్టంబుతో నేటికిన్ ।
గంటన్నివ్వోకసారిఁజూడకయె • మూఁగల్ బోలుచున్ బోవుటల్ ॥ 16

అర్జు— ఏమేమి ! సూతాధముఁ డెంతటిమాటలాడెను.

చారి— దేవా ! కులపువాసనపోవునా ?

కృష్ణ— వారలదివిని యూరకొనిరా ?

చారి— ఊరకొనుటయేనా ! కర్ణునిప్రాణములు నిల్వకయే పోవును వినుఁడు యిట్టి యసందర్భపుఁ బోటుమాటలీటెల సాటినాట, వానివైపుఁ దిరిగి గురుపుత్రుఁడు చట్టునవాలుఁ బెఱికికోపకషాయితాత్ముఁడై యిట్లు వాక్రుచ్చె "ఓరోరి ! శూరమ్మన్య! అనన్యసామాన్యాభిమన్యు బాణపరంపరాభిఘాతజర్జరీభూత కురుకులనాశన ధౌరేయ యోగ్రి రాధేయా ! కురురాజు చెవిలో జోరీఁగవై కొండెములు సెప్పుట నీప్రజ్ఞగాదు. మాపైనీకీర్ష్యయున్న గత్తిఁగట్టి దిట్టరివైరమ్ము మీయందఱి చేతులలోఁ బెరిగిన దౌశ్శాసని నభిమన్యున కెఱయిచ్చి బాలునొక్కనిఁజేసి పలువురుగూడి చంపితిమిక దా యనియైన సిగ్గులేక మీరంతఱు చంకలెగురవేయుట చాలదా ! సాయంసంధ్యానుష్ఠాన సమయమాసన్నమౌటచేఁ బోవుచున్న మమ్మిట్టులనుటనీ నీచబుద్ధియే వెల్లడియగుచున్నది. అచ్ఛస్ఫటికముగూడమసియబూసినగాని జెందునట్లు నీరాజు నీమాటలకుఁ జెవినిచ్చి చెడుచున్నాఁడు. నిన్నుఁ జంపఁ బ్రతిజ్ఞఁగొనిన నర్జునుఁ జూచి నీకుభయముండవలయు. ఇఁకనొకసారిట్లనే ప్రేలితివేని నీతల వ్రక్కలగునని యూరకుండెను.

అర్జు— చారిత్రా ! వాలుఁ బెఱుకునంతటి కోపమంతలోనే చల్లారినది చూచితివా బ్రాహ్మణుల కోపము.

చారి— దేవా ! వానికొక కారణముగూడనుండెను. కృపాచార్యుఁడు పోటుమాటలేలయని కనుసైఁగఁ జేసెను.

కృష్ణ— దుర్యోధనుఁడు ప్రత్యుత్తరమిచ్చెనా ?

చారి— దేవా ! దుర్యోధనుఁడు కాలమహిమచేఁ గాఁబోలు ఛల్లనుఁ గొట్టినజాతిపలెనే యూరకుండెను.

అర్జు— తనమిత్రునిదే తప్పు నిగ్రహించియుండఁబోలు.

కృష్ణ— తరువాత ?

చారి— ఇట్లు మెల్లమెల్లగ యోధులెల్లరు గుడారములు జొచ్చిరి. నేనుప్రళయ కాలాభీల పుష్కలావర్తఘనాఘన గర్జారవముబోలి జేవర ప్రతిజ్ఞావాక్యస

ములు కౌరవహస్తాలంకృత ధనూవరములు వారిమనోరథములతోడ జాటి క్రిందఁ డొల్లఁ ధాత్రీ రాష్ట్రకాంతాగళ విరాజమానమంగళ సూత్రములు పుటుక్కుమని తెగునట్లు మేరువుబోలు నేదునచ్చటినాదముతోఁ గలసి యూఁడ భేరీని నాదములతో నొక్కపెట్టి భూమిసప్తకుల పర్వతములు దిర్ది రందిరుగునట్లు వినవచ్చెను. అటుతరువాతఁ గొంతవఱకుఁ గౌరవశిబిరములు పాడిండ్లవలెనే నిశ్శబ్దములైయున్నవి కానియొకతృటిలో సైంధవశిబిరంబునఁ జెద్దయేడ్పువినవచ్చినది. అదేమనిచూడ సైంధవుఁడు దేవరవచనములాలించి విలపింపఁదొడంగిన వానితోనాఁడువారును నేడ్వసాగిరి. ఆరోదనము తుద కెల్లరకుఁదెల్లంబయి యుల్లంబుల భేదిల్లమొదలు పెట్టినది. అప్పుడాతఁడు తనకేడుగడయగు దుర్యోధనుఁడిక్కడి వృత్తములవారి వార్తావహులచేఁ బేరోలగంబునమెండుసంతసంబున వినుచుండఁబోయి యనాథాంగనవలెఁ బెద్ద పెట్టున రోదనము జేయనారంభించెను.

అర్జు— (అబ్బురముతో) ఏమేమి! తరువాత! తరువాత!

చారి— తరువాతనో దేవా! కౌరవయూథపులిది యేమనియచ్చెరువడిచూడ గర్జా ద్యాప్తపగణంబురానున్న కష్టముదెలియక చింతింప రారాజాతురమునవగ్గ రకు దీసిమందలింప నెట్టకేలకుఁ గనులనుండి భాష్పధారలు కాలువలయి పాఱ గద్గదికముతో సైంధవుండిట్లనియె.

శా॥ ఓనామిత్రవరేణ్యులార! వినుఁడ ♦ యొహ్యానాదుదీనోక్తులన్
నేనేసంగరమందుఁ పాండవులకున్ ♦ నిక్కంపుశత్రుండనో
కానీనన్నొధనంజయుండుపటుసం ♦ గ్రామాంగణంబందురే
పేనాకంబుజొరంగఁజేయునఁటని ♦ ర్భీతుండనైనిల్చినన్ 17

గీ॥ బ్రతికియుండినబలుసాకు ♦ నతులితముగ
మెసవిబ్రతుకంగవచ్చునీ ♦ వసుధయందు
వరకపిధ్వజుఁడాడిన ♦ పల్కునిజము
గాకయుండునేకృష్ణుండు ♦ గలిగియుండ. 18

కావున నాయవి దీనోక్తులని నిరసింపక కరుణార్ద్రహృదయులై నాకుఁబో వ సెలవిచ్చిన నేనిదేప్రాణ సంరక్షణార్థమై నడియడవులఁబడియెదనని వెక్కి వెక్కియేడ్వసాగెను.

అర్జు— ఛీ!ఛీ! బాలిశాధమా! కులాచారకుఠార! అఁడముండా! మాకులమునకల్లుండ వయి మాకును దలవంపులు దెచ్చుచుంటివి. చారిత్రా! యేతచ్ఛరణాగత రక్షణబిరుదాంకుఁడగు సుయోధనహతకుఁడేమని మందలించెనో నుడువుమువి నివెదను.

చారి— దేవా! యిట్టియధీరాలాపంబు లాలించఁగురు కుమారాద్యాప్త వర్గంబుమిగుళవగలఁబొదలిరి. ఇతరసామంతరాజులులోలోననవ్వికొనఁదొడంగిరి. గురుకృపాశ్వద్ధామాది పాండవపక్షపాతులు దేవరకిది యొక్క శుభసూచకముగా యోచించిరి. అప్పుడురారాజు కర్తవ్యాంశమాలోచించు వానిఁబోలెనట్టెచి త్తరువుఁబువుణించెను. కొంతఉయోధులు తమకేదిమూఁడునోయనియింటికిఁ జల్లచల్లగజాజిరి. అంతరాజు తేజిపారఁజూచి సైంధవునితోనిట్లయె.

గీ॥ పాఱిపోవఁగనీకేటి ♦ భయముబావ!
నరుపరితాపమోర్వఁగయోధ ♦ వరులులేరె!
శరగురుండయినద్రోణుండు ♦ వరబలాఢ్యుఁ
డైనకర్ణుఁడున్నిప్డు ♦ కానకిడునె? 19

కావున నీవిట్టియధీరాలాపంబులవీఁడి నీవీడుజేరి నీయాడవారలతో సుఖంబుండము. అనిచెప్పనంతే నాతఁడు నన్నుఁజంపుకొననిచ్చయున్నఁ జోనీకము లేకున్న నన్నువదలుము.. త్రిలోకభీకరానేక సాయకనాయకుఁడైననరుండు వరవానరశేఖర ధ్వజాలంకృత దివ్యస్యందనముపై సుందరవదనారవిందమందు మందహాసముఁదోఁపఁ గోదండోత్తము గాండీవజ్యాటంకార చలద్బ్రహ్మాండుఁడై యంబకపరంపరఁ బర్వుచునురువడింప నిలింపులకన్న మాటయేల సాక్షాన్నిటలాక్షుండెదుర నిలువఁగలుగడనుట నిస్సంశయము. ఈ నాఁడు బాలునిపోరాటములోవలె మాయలుబన్నుటకు మాయలమారికృష్ణుండుండెఁగదా! అట్టివారిఁ దేరిచూచుటకును మనకర్ణాదియోధ బృందములోడకుందురా! కల్ల!కల్ల! నేనీరణమందున్న నాప్రాణములకు నిరాశజేసుక రావలెఁగానినన్నుఁగాపాడువారుండరు కావున క్షమించి యనుజ్ఞనిమ్మని కాళ్ళపైఁబడెను.

కృష్ణు — అరణ్యమధ్యంబునఁ దనకైన పాట్లిప్పటికి జ్ఞాపకముజూపెఁగాఁబోలు

చారి— తరువాత నో దేవా! రారాజోడకుండమని లేవఁదీసి ద్రోణునియొద్దకుఁ దీసుకొని యేగి నీనిట్లయిన రక్షింపక తప్పదని కాళ్ళపైఁబడవైచి తానును బడెను.

అర్జు— ఏమేమి! ఆమహాత్ముఁడేమనెనో!

కృష్ణ— ఈమర్యాదకోడంబడకుండునా?

చారి— దేవా! అప్పుడాతఁడు వారలిద్దరిలేవనెత్తి యక్కునఁజేర్చి యనునయవాక్యంబులఁ జెక్కువక్కాణించి తుదకభయమిచ్చితినని సైంధవునకు ధైర్యము చెప్పి యోదార్చెను అప్పుడాతండట్టకేలకు దృఢపడి యింటికేగెను నేనునిటకు దేవరదర్శనార్థమై యేతెంచితి.

అర్జు— చారిత్రా! చిత్రములు విచిత్రములుగా ముచ్చటించితివి పొమ్ము.

చారి— చిత్తము. (అనినిష్క్రమించును)

కృష్ణ— నేనొకందులకుఁ జింతించుచుంటి

మ॥ కదనంబందున సైంధవున్ జెనకుటల్ ♦ కాకుండినన్నివెయి
య్యోదోచేయంగలనంచుఁ బల్కితివి; యా ♦ యింపైనవాక్కుల్వినన్
ముదమైవారలు సైంధవుర్ రణభువిన్ ♦ బోల్పొప్పరక్షింపఁగా
మదిపారుంబురికొల్పవాఁడభయమున్ ♦ మోదంబుతోనిచ్చెఁగా 20

మరియు

గీ॥ మదుసలియటంచు మనమున్న ♦ గదనమందుఁ
గదలమెదలనీయక రయ సురి ♦ క్రింగఁజేయుఁ
గరుణమైవదలిననిల్వఁ ♦ గలముగాని
యతనిబాణపరంపరన్ ♦ బ్రతుకఁగలమె?॥

అర్జు— (అబ్బురముతో) బావా! మహానుభావ! యెందులకీపిఁజికి మందు? యిట వినుము.

మ॥ గురుడైనన్ గిరిగర్వభంజకమహా ♦ ఘోరస్వరూపధ్ధత్వరం
దరుఁడైనన్ త్రిపురాసురోద్ధతిహర ♦ చ్చండోగ్రశూలస్ఫుర
త్కరుఁడైనన్ కమలాసనుండయినసం ♦ గ్రామంబులో రేపున
న్నరికట్టన్ సమకట్టలేఁడనుటస ♦ త్యంబింక శంకేటికిన్ 21

అదియునుగాక మహాత్మా!

ఉ॥ లోకము లెల్లఁ బుట్టినిడి ♦ లోటొకయింతయు లేక ప్రోచునీ
ధాకకుమారు వాఁడుగలఁ ♦ డాభువన త్రయమంతుఁ జూడఁగా
నాకిఁక నేటిభీతికద ♦ నంబున నానొగ లెక్క.నీ వెయ
స్తోకరయంబునన్ రథముఁ ♦ దోలుచుఁ బోవఁగ దేవకీసుతా॥ 22

కావున భవదాజ్ఞానుసరణ సమర్థిరుండనైన నాకిఁక విచికిమందుఁ బోయెదను

కృష్ణ— ఔనానది యెఱుంగకపోలేదు. కాని నీవిప్పుడు శుచివై పశుపతినారాధించుము.

అర్జు— ఏటికి బావా!

కృష్ణ— ఏటికన నేటికి నామాటఁ బోటుపోనియ్యక యెంగులకోముందు ముచ్చటించెద గాని యయ్యార్త త్రాణపరాయణుండగు శంకరునారాధించుము.

అర్జు— మహాప్రసాదము. (పద్మాసనుఁడయి చిన్ముద్రపట్టి)
జయజయ శ్రీమద్ధరణీధర కన్యామానసాబ్జభృంగా! యుత్తుంగమాతంగవిభంగా! భసితావృతాంగ! తాండవ శేళీసంగా! లీలాధృతకురంగ! మాంపాహి! మాంపాహి! మాంరక్ష (అనినిమీలితలోచనుఁడగును)

కృష్ణ— (తనలో) ఇప్పుడే యితనినంబరమార్గమునఁ గైలాసమునకుఁ గొంపోవుదుఁ గాక

అర్జు— (నిమీలితలోచనుఁడై)

క॥ హరుడవు మదీయపాతక
హరుఁడవు సకలభువికంట ♦ కాచారకసం
హరుఁడవు నజ్ఞానాంధమి
హిరుఁడవు కావగ దెనన్ను ♦ నెంతయుఁ గృపతో॥ 24

(తోడనే కృష్ణుఁడు వానిఁబట్టుకొని యాకాశమున కెగురుచు యవనిక జాఱును)

ఇది తృతీయాంకము.





ఓమ్.

శుభమస్తు.

# సైంధవార్జునము.



## చతుర్థాంకము.

ప్రదేశము—కౌరవశిబిరప్రాంతము ప్రవేశము—కౌరవభటుఁడు

భటుఁడు—(పండుకొనియుండి)ఏదియెట్లున్నను భూభారము తగ్గింపఁ బడుటయే యీ వెఱ్ఱిగొల్లనికి నాఁటనికి నుద్దేశమైయుండును. పోనిమ్ము నాకేల యీబాధ; రాత్రియంతయు నేప్పులు పెడబొబ్బలచే నిద్రఁబట్టలేదు. (ఆవులించి)విధ పనిద్ర మఱల మొదలుపెట్టినది: నిద్రపోవుదునా?

2వ భటుఁడు-(ప్రవేశించి) వాని యదృష్టమే యదృష్టము. దరిద్రుఁడు తలఁ గడిగికొనఁబోవ వడిగండ్లువాన యనునట్లు మనవారెంత గింజుకొనినను పెద్దమ్మ నెత్తిపైఁ ద్రొక్కుచునేయున్నది. (పరికించి) బావా! బావా!

1వ భటుఁడు-(నిద్రనభినయించుచు) ఛీ! ఛీ! నన్నుఁబిలువకు నేను నిద్రఁబోవుచుంటిని

2వ భటుఁడు- బావా! నీనిద్రకు గుఱ్ఱులేదేమి?

1వ భటుఁడు-గుఱ్ఱుండుటకు నాదియంత మెలకువ నిద్రగాదు.

2వ భ—మాట్లాడుచు నిద్రించుట నీకొక్కనికే కాఁబోలు నేమి?

1వ భ—ఇప్పుడు నేను మాట్లాడుచున్నా ననుకొనుచున్నావా?

2వ భ—ఇంతకన్నవిరుద్ధముగా నెట్లయిన నెప్పుడైన మాట్లాడఁ గలవా?

1వ భ—నీవంటివారు వచ్చినప్పుడే!

2వ భ—ఎంతసేపటినుండి యీనిద్ర?

1వ భ—నాకు మెలకువ వచ్చినప్పటినుండియును.

2వ భ—ఈవికటముల కేమిగాని నిన్నటి రాత్రి నర్జునుఁడు కైలాసమేగినాఁడఁట విన్నావా!

1వ భ—(తటాలున లేచి) నారాయణ! జబ్బేమిటి? చెప్పు! చెప్పు! శైవమతస్థుఁడు గనుక నా కైలాసమేగెనంటివి. ఎంతపనిజరిగినది! కృష్ణుఁడుగూడ వెళ్ళినాఁడా

2వ భ—ఏడిచినట్లేయున్నది నీయొకసక్కెములు. తుదవరకు విని మఱియేద్వ్యము కృష్ణుఁడును వెళ్లినాఁడు.

1వ భ—నారాయణ! మొత్తుకున్నట్లె యున్నది! చావు కబురు సందిగ్ధముగాఁ జెప్పఁ గూడదని యెఱుఁగవా? నిన్నరాత్రి నెవరెవరేగినారో చెప్పుము.

2వ భ—చావుకబరెక్కడిదిక్కడ?

1వ భ—ఇప్పుడు చావకుండఁ గైలాసమేగినవారెవరు?

2వ భ—కృష్ణార్జునులు.

1వ భ—సరి! సరి! కైలాసమేగి?

2వ భ—అచ్చట శంకరు దర్శించి పాశుపతాస్త్రము సంపాదించెనఁట

1వ భ—అప్పుడే నీకెట్లు తెలిసినదిరా?

2వ భ—నీవలె నిప్పటివఱకు నిద్రఁబోయిన నాకునుఁ దెలియక పోవును.

1వ భ—అయిన నిప్పుడు చుక్కపొడిచినదా?

2వ భ—చుక్కపొడుచుటయేగాదు సూర్యకిరణములు నీప్రక్కఁ బొడుచుటకు సిద్ధముగానున్నవి. చూడుమటు.

సీ॥ పాంథజనులనెల్లఁ ♦ బట్టుక శోధించి
బాధించిపోయెనా ♦ పంచశరుఁడు
తతవియోగానల ♦ తప్తముల్ కోకముల్
గలసితావంతలఁ ♦ దలఁచుకొనియెఁ
జంద్రకిరణజాల ♦ సక్తమై స్రవియించు
విధుమణుల్ ద్రవతను ♦ విడువఁబోడఁగెఁ
కుక్కుటంబులునిండ ♦ నెక్కిరెక్కలవిచ్చి
కుక్కురోకోయంచుఁ ♦ గూతలిడియెఁ

గీ॥ బరిసరారణ్య బహువిధ ♦ ఫలకుసుమ ప...
రిమిళలహరీసమేతవా ♦ తమతులగతి
వీఁచఁదొడఁగె వృక్షములపై ♦ విచ్చలవిడిఁ
బక్షిజాతంబు లేఁగెఁబ్రి ♦ భాతవేళ॥

1వ భ—(లేచి యావలించి) బావా! నీవర్ణనలో నానిప్రసంగతి నేమియుఁ జెప్పితి కావేమి.

2వ భ—నీవింకముందుందువో లేదోయని.

1వ భ—నీతోఁగూడఁ గృష్ణునివలె వత్తుననికొంటివా?

2వ భ—నాతోవచ్చిన నీవు లేకపోవుదువను జింతయేలేకపోవును.

1వ భ—నిన్నటిదారి తప్పెనాయేమి?

2వ భ—తప్పదా? నిన్న నభిమన్యుఁ డీవేళ నర్జునుఁడును

1వ భ—చచ్చుటకా?

2వ భ—కాదు! కాదు. మనలఁజంపుటకు! రారమ్ము పోవుదము ఉన్నవాల్లుగడియలు. జెంస్లాము బిడ్డలఁ జూముకొన్న మంచిది.

1వ భ—జౌనాను నిన్నటి నాబ్రితుకు బ్రితుకుగాదు యీనాఁడు తప్పించుకొని వచ్చినబ్రితుకు బ్రితుకు

2వ భ—ఈనాఁడు బ్రతుకు మనము ముందుఁ దరువాత సైంధవుడునుజముపురమునందే

1వ భ—అంత నిశ్చయము మనకేల (పరికించి) అల్లదిగో చూడుము మప్పుడే మన ముసలి సైన్యములను గుడికి మేకపోతులఁ దోలునట్లు తోలుచున్నాఁడు

2వ భ—అల్లదిగో జూడుమటువైపు పాండవసైన్య మురవడించి పాలకడలి లాగున మూగుచున్నది. మునుముందదిగో మనపాలిటి మృత్యురథము.

1వ భ— రారమ్మికఁ డనున్న మాటపక్కదు.

(నిష్క్రమింతురు)

(వెంటనే కృష్ణార్జునసాత్యకు లేకరథముపైఁ బ్రవేశింతురు)

కృష్ణ—కట్టా! సాత్యకీ! ఎందులకీ వృథాకాలక్షేపము పోయియాధర్మరాజ రక్షణార్థమై మీరందఱు నిలుండు,

అర్జు— సాత్యకీ!

ఉ॥ ద్రోణుఁడు నాడినట్టిపటు • రోషపుబ్రిజ్ఞలవింటివే కదా
మానక మీరలందఱును • మానవనాథునిఁగాచికోవలెన్
నేనొకఁడైతినంచు మది • నీవిఁకఁజింతఁగొనంగఁబోకు నా
బాణపరంపరల్ తగులఁ • బాఱకనిల్తురెవారు సాత్యకీ॥ 2

సాత్యకి—మహానుభావ! బావ

గీ॥ దేవతలకైన నిన్నాజిఁ • దేఱిచూడ
రాదటన్నఁబిన్నలగు వీ • రలకువశమె?
యైననీప్రతిజ్ఞలఁ జూచి • నేనొకింత
కాలు నిల్వకయుంటినీ • కదనమందు 3
ఇచ్చట రాజుఁగాపాడుట కంటివా?

గీ॥ శత్రుభీకరుండౌ వాయు • పుత్రుఁడుండఁ
దక్కఁగలయోధయోధంబుఁ • బిక్కటిల్ల
ద్రోణునకు మారకగ్రహ • మైన ద్రుపద
సుతుఁడెనిల్వ భయముధర్మ • జునకదేల? 4
కావున నామనవిఁ జెల్లించి

అర్జు— (అర్థోక్తియందే)

గీ॥ నాదుసంరక్షణార్థమీ • యాదిపురుషుఁ
డైన నారాయణుండుండ • నడలనేల?
అదియుఁగాక యుధిష్ఠిరు • నంతవాని
రక్షణమెకాక యితరక • ర్తవ్యమేది? 5

కృష్ణ— సాత్యకీ! సందేహమేటికి నీవుపోయి యచ్చటనేయుండుము.

అర్జు— నారక్షణముకన్న ధర్మజునిఁగాపాడుటయే ముఖ్యముకదా? నేనిక్కడలేని లోటు నీవుండినఁదీరును గాన వేవేగపోయి మీరందఱుమందరణ వ్యాపార పారీణులై కౌరవసైన్య పారావారమునకుఁ గట్టలైనిలుఁడు.

(అంతఁ దెరలో)

శా॥ ఏఁడీయర్జునుఁడేడిఁకృష్ణుఁడిటరాఁ • డేలాసమీరాత్మజుం
డేఁడీసాత్యకి వీరలందఱిపుడెం • దెందుండిరో చూడమా

తోడన్ సంగరమందుఁ బోరెదరొ లే • దో వేళయున్ మీ కెఱపీ
రాడంగాఁగలరన్నొ భీరువులఁగా • ర్యంబింత కాలేదుగా॥

(తోడనే రణభేరి మ్రోఁగును)

కృష్ణ— సాత్యకీ ! త్వరపడుము. త్వరపడుము చూడుమా దుశ్శాసనుఁడొక్కొ క్రొవ్వెక్కి కుక్క మొఱఁగునట్లు పేర్లుచు రణభేరి మ్రోఁగించుచున్నాఁడో !

సాత్య— చిత్తము. అర్జునా ! సెలవా !

అర్జు— వేవేగ మేగుము.

సాత్యకి:— చిత్తము. (నిష్క్రమించును)

(తెరలో)

పంచచామరము.

అరే ! దుష్టదుశ్శాస • నా ! యేమియంటివే !
దురంబందు నిన్నిప్డు • దుర్గంగఁ జేతుర్
దిరంబై గదాదండ • తీవ్రాభిహతిన్ గా
వరంబింకఁగానీదు • ప్రాణాలఁజీల్తున్ ॥ 7

(రణభేరీ మ్రోఁగును)

కృష్ణ— కనుఁగొనుమా ! భీమసేనుఁ డప్పుడె దుశ్శాసనుపైఁ బడియె

అర్జు— (పరికించి) చూడు బావా ! యీ బ్రాహ్మణునివ్యూహనిర్మాణచాకచక్యము.

మ॥ శకటవ్యూహముఁ బన్నిమధ్యమునన • జ్జంబొందు నిర్మించిదా
నికిలోఁగాఁ గురురాజ సైంధవబలా • నీకంబులన్ నిల్పిపా
నికి సూచీవిధ మొప్ప సైన్యమునుబ • న్నించెన్ బలోపేతుఁడై
శకటంపున్ మొనముందునిల్చెగురుఁ డా • శ్చర్యంబు దాకొంపుచున్ ॥ 8

కృష్ణ— పార్థా ! చూచితివా ! యీదుశ్శాసనుఁడు బ్రాహ్మణుఁడు చెప్పినచొప్పుననే యిందునాయుమ మొండిగర్వముచే వ్యూహములో నుండక యిక ను మన భీమునిచేఁ జావమోదింపఁ బడుచున్నాఁడు.

అర్జు— అందువలననా ! తీవ్రముగానుండవలసిన ద్రోణుఁడు నాకంటికి నేఁడు జబిల్లికంటెను చల్లఁగానున్నాఁడు.

కృష్ణ— అట్లుండుట యతనిప్రసన్నతచేఁగాదు నీసంకల్పసిద్ధిచేత !

అర్జు— ఆట్లెట్లగును. నీప్రసాదముచేతనే యనుకొనెదను. మాటలకేమి లెమ్ము సజ్జి
ములపగ్గముల సడలవిడిచివడివడిఁబోనిమ్ము.

కృష్ణ—నీచిత్తమువచ్చినట్లే ! [అనిరథమువడిగాఁ బోవుటసూచించి] చూడుమిదే యుద్ధభూమి.

అర్జు— అస్త్రదాగమన సూచకముగాఁ దేవదత్తమును బూరింతువా !

కృష్ణ— ధనంజయా!

గీ॥ నిక్కముగనీదుగాండీవ • మెక్కువెట్టి
గుణముసారించి బాణముల్ • గ్రుమ్మరింప
దేవదత్తధ్వనికిముందుఁ • దెలుపునదియె
పార్థుఁడుసుఁడీ మమ్ముఁజంపెఁ • బదిలమనుచు ॥ 9

అర్జు— నీయభీష్టమే తీర్చెదను (అనిబాణములేయ వానినఱకుచు దూరముగ ద్రోణుఁడు ప్రవేశించును.)

కృష్ణ— అర్జునా !

గీ॥ యజ్ఞవేదికాధ్వజమెంతొ • యంద మొంద
ధళధళాయతధౌతవ • స్త్రము ధరించి
వరశరాసనమాశుగ • వర్షమాన
దురముసలుపంగఁబరతెంచె • శరగురుండు ॥ 10

అర్జు— బావా ! వేవేగమాతని సమీపింపఁజేయుము.

కృష్ణ— సరె. (అని యట్లుచేయును)

ద్రోణు—(సమీపించి) అర్జునా !

చ॥ అతులితసంగరాంగణము • నందునిలింపులకింపునింపన
న్నతిభుజ శౌర్యసంపదల • నందిజయించుమిదే ధనంజయా!

ర్జు— (అర్థోక్తియందే)

పితరులఁబోలిదీవనలుఁ • బ్రీతిమెయిన్ జలుపంగనేఁటిరా
జితరిపుజాలుడౌటఁలిఁకఁ • జిత్రిముతానెధనుర్గురూత్తమా!

ద్రోణా— ఆఖండల నందనా ! నాదీవనలను మాటయేల ? నరసురాసురాజేయుఁడవగుమనినిన్నుఁబెద్దయుం బ్రొద్దుగారవించిన గంగాధరుండెవ్వఁడు నీ ప్రాపైయుండుటయేకాక.

మ॥ త్రిజగద్వంద్యుఁడు రక్షకుండురవిరా ♦ త్రినాథ నేత్రుఁడుభ
క్తజనానందకరుండు విష్ణుఁడగునీ ♦ ధాత్రీ ధవుం డెప్డునీ ;
భుజమైనట్టిలిప్రీతి పెంపునర ♦ థంబుంగ్రోలఁగావచ్చెనో ।
విజయా ! దీవనలేల ? వేఱెఁనప్పు ♦ డ్వీకార్యసంపత్తికై ॥ 12

కృష్ణు— ఏదియెట్లున్నను గుర్వాశీర్వాదము సర్వారిష్టహారంబేకదా ! గావునఁదమప్రియశిష్యు మన్నింపవేఁడుచున్నాను.

ద్రోణా— కృష్ణా !

మ॥ మనపార్థుండనినట్లు తండ్రినినలెన్ ♦ మన్నింపఁగాఁగంటినే ।
ననువానిన్దయతోడనట్లులనె నూ ♦ నున్ బోలెవీక్షింతునై ।
ననుదుష్కౌలవశంబునన్ రణమున ♦ న్నాహంబయెన్ గృష్ణ ! దా
నిని భంగంబొనరింపకుండఁగనె మ ♦ న్నింతున్ దయన్ బార్థునిన్ ॥ 13

అర్జు— మహాత్మ ! శరగురుప్రవరా !

గీ॥ దేవదేవుబోలిన మీదు ♦ దీవనలను ।
బడయుటే చాలువేఱుగ ♦ మన్న నేల ? ।
వల్లకై వచ్చియుంతదా ♦ వకయేమీరు ।
రణమొనర్పఁగ సెలవిండు ♦ రయముతోడ ॥ 14

ద్రోణా— (వికటముగా) కిరీటీ !

గీ॥ కదనమారంభమైనట్లు ♦ కనుఁగొనంగ ।
మనదుభేరీనినాదంబు ♦ వినఁగఁబడదె ? ।
సవ్యమైయున్న నీధనువుద్య ♦ శ్యంబుకాదె ? ।
యింక నేటికి సెలవులో ♦ యింగితజ్ఞ ॥ 15
కావున వేవేగరారమ్మిదే బాణములు వదలచున్నాను.

(బాణముతేయును)

అర్జు— (దానిఖండించుచు) మహానుభావా !

గీ॥ మీవలన నేర్చినచదువు • మెపలుచున్న |
సమరధర్మంబుభంగింప • సాహసింప |
నెవరొ చెప్పఁ గొఱకికంత • నేనుసిద్ధఁ |
గొలికయత్నింపనుండి స • ద్గురువరేణ్య ! ॥ 16

ద్రోణు— (తనలో) హా ! హా ! నిన్నటి నాకార్యము బాగుగనెత్తి పొడుచుచున్నాఁడు. ఏమియనుటకు నోరాడకున్నది. లోనికూరక నీనిఁబోనిత్తు మన్న దిణఫలమ్ము విరోధ మొకటియే గాక రాజాజ్ఞకుఁ బ్రజలవిరోధుఁడ నౌదును కానిమ్ము కృష్ణుఁడుండెఁగదా యేదియో నొక యుపాయమాలోచింపక పోవునా ? (ప్రకాశముగా) అర్జునా నావలన నేర్చిన విద్యయే కాన నాకప్పఁ జెప్పుము నన్నోర్చినఁగాని నిన్నొక్క యడుగుఁ గదలనీయను.

(బాణము లేయును)

అర్జు— మహాత్మా ! తమయభీష్టమే తీర్చెదను.

కృష్ణు— (రహస్యముగా) ఏటికీవెఱ్ఱి !

గీ॥ మసలిబాపనితోడనీ • యసమసమర |
కేళిసల్పుచుంటివికాని • కేవలంబు |
ధీసమానారి సైన్యంపుఁ • దెంపుఁగనవు |

అర్జు— యెఱుగుదును నాజిసీరుని • నెట్లువిడుతు ? ॥ 17

కృష్ణు— ప్రసన్న వాక్యము లాడించుచుండుమేను రథముఁ బ్రదక్షిణమిపలోనికిఁ బోనిత్తును.

అర్జు— పెలుపు మాటలకుఁ దరువాతం బ్రసన్న వాక్యములేల ! సుముష్టముపచ్చె నిట్టి రథము దోలుము నాయిష్టము వచ్చినట్లుబోరెదను.

ద్రోణ— అర్జునా ? యూరకొంటివేల బాణములేవిరావేమి ?

అర్జు— మహాత్మా ! తామశరంబులేసిన నేనేయుదు.

కృష్ణు— (తనలో) ఇదేసమయము. (ప్రకాశముగా) గురుప్రవరా !

సీ॥ తల్లిదండ్రులకన్నమ • మ్మెల్లవేళ |
లందు సాకినమీకిదే • వందనములు |
(అర్జునుపైఁ బైఁదిరిగి) అర్జునా మనమాయన • కరచమొక్కి |
యన్ బ్రదక్షిణమునుజేయ • కేగఁదగునె ? ॥

(అనిరథము నతివేగముగాఁ బ్రదక్షిణముజేసి లోపలికేగును)

ద్రోణు— (చిఱునవ్వుతో) ఆఁ! ఆఁ! కృష్ణా! మాయకాఁడా! ప్రదక్షిణమిషచే లోనికిఁబోయిన వదలుదుననుకొంటివా? వెనువెంటనే నీపేఁపు వ్రక్కలు జేయనా?

(అని వెనువెంటనే పోవును)

(తోడనే యంబర మార్గమునుండి దిగి సౌగంధుఁడు ప్రవేశించును)

సౌగ— ఆహా! కృష్ణుని చాకచక్యము! ఒకలిప్తలో రథములోనికిఁ బోవునట్లు చేసెను. (పరికించి) అయ్యయ్యో! ద్రోణుఁడును వెంటనంటి యెట్లురుకుచున్నాడో?

సౌరభ— (ప్రవేశించి) అన్నయ్యా! చూచుమా యర్జునుని వెనుకవచ్చెడి ద్రోణప్రయుక్త బాణపరంపరం గత్తిరించి ముందుకవడెందునున్న సైన్యమును జించి చెండాడుచుఁ గృష్ణునకు దారిఁ జేయుచున్నాఁడో?

సౌగ— చూడు చూడు సౌరభా! పాపము కృష్ణార్జునులు కుంభ సంభవుని క్రూరనారాచములు వక్షము దూరనొకింత సోలిమలలేచిరి.

సౌర— అగునగు నన్నయ్యా! కాని యీపోరుని చలమేచలము. (పరికించి) అయ్యో దాఁటిపోయిరి.

సౌగం— అబ్బబ్బ! యీద్రోణుని మొగముఁ జూచుము ఖిన్నతవహించి యెట్లు ముకుళించినదో..

సౌర— అన్నయ్యా! యీచతురంగముల పాట్లెట్లుండెనో కాంచుము.

సీ॥ కులిశధారాహతిఁ ♦ గూలుధరాధర
పంక్తియో యనఁగద్వి ♦ పప్రకరము।
పెనుగాలితాకుచే ♦ విఱుగుధారాధర
రాజినానుద్భట ♦ రథచయంబు।
లింద్రజాలికుకోల ♦ నిట్లున్నమాయమూ।
వస్తువోయనఁగన ♦ శ్వనికరంబు
గాలివానలఁగూలు ♦ కదళికాప్రకృసం
తతులనంగఁజనుప ♦ రాతిసమితి

గీ॥ నరసురాసురాభంగమై • చట్టిగాండి
వపురుక్త్రప్రచండాశు • గప్రకాండ
హతినిగతులు దప్పిక్షితికిఁ • జలికిలఁబడి
మాయెమైపోయెనురణ • మహినిఁజూడ ॥ 19

సౌర — మనమాసంవడిభూరిఁ గాంచనేలేము. కృతవర్మ యర్జును నడ్డగచ్చె గాఁబోలు దవరథముపైఁ జచ్చియుఁ జూపనిపీనుంగు భాతిఁబడియున్నాఁడు (పరికిఁచి) అగ్రజా ! చూడుము మామితుని పాటుఁజూచి సహించలేక కృష్ణార్జునులఁ బొదివిపమనగు ప్రదరములవదల మొదలిడిన భోజపతిని.

సౌగం— అనుజా ! పాపమాయర్జునుఁడు బంధువని యూరక బాణపరంపరసహించి. వంచనఁజేయుచుండనున్నాఁడు.

సౌర— అగ్రజా ! విను మేవోకృష్ణుఁడు వ్రాకుచ్చుచున్నాఁడు.

(తెరలో)

గీ॥ బంధువంచునుదయఁజూడ • బవరమందుఁ
బనులుసాగఁగాఁగలవె • యోపార్థివేంద్ర?
శత్రువులఁజేరియున్న భో • జపతియిపుడు
తలఁదలుగఁగాఁబడఁదగున • తండెసుమ్ము !॥ 20

సౌగం— అరరే ! కృష్ణుఁడిట్లు చెప్పెనోలేదోకాని తనుత్రరక్షణమందె భోజపతిము కాంభోజుగాజుఁబారి ఖండితభూజమట్లు తేజముతప్పి రథముపయినుండి. పడియె.

(తెరలో)

గీ॥ పిచ్చుకలపైనిబ్రహ్మాస్త్ర • మచ్చుపడఁగ
నెత్తినట్లు కాసునుజేయ • నివరణీప
సమితితోసమరముఁజేసి • జాగుసేయ
సమయమేయిదిసైంధవుఁ • జంపవలదె ? ॥ 21

సౌర— అన్నయ్యా ! కృష్ణుఁడిట్లని తనరథచోదకసామర్థ్యముఁ జూపుచున్నాఁడు ఇఁకనీవీరునడ్డువారులేరుసుమా ? (పరికించి) శృతాయుధ ప్రముఖమహారథికులు బలములతో నురవడించిరి చూచితివా పిరివలన నేదియువఁ గార్య మండునా ?

సాగ— ఉండెడిదేమిటి

గీ॥ మనమనుకొనుటయేతడ • వశగనయ్యెఁ
గానియింతగానరునిపైఁ • గాలుద్రవ్వ
రథగజాశ్వపదాతులు • రణధరణిని
బాణజాలంబులోనన • లీనమైరి ॥ 22

సార— పాపమీ సైన్యమంతయు రక్తసముద్రమందు మునిఁగితేలుచున్నది కాని యొక్కరుఁడును నిలువరింపలేకపోయెఁగదా ? అగ్రజా ! సైంధవపతాక మేమయినఁ గాన్పించుచున్నదా !

సాగం— కాన్పించకేమి ? దూరముగానున్నది.

సార— అగ్రజా ! దుర్యోధనుఁడేలకో మొనవయిపునకుఁ బోవుచున్నాఁడు.

సాగం— ద్రోణాచార్యునితో మంతనములేమో కాంతుమురమ్ము.

(నిష్క్రమణము)

2 వ రంగము.

[ప్రదేశము.] రణభూమి — [ప్రవేశము] ద్రోణుఁడు విగతరథుఁడై

ద్రోణుఁడు (తనలో) ఆహా ! యీపాండవసైన్యము

ఉ॥ బాణపరంపరాశతమ • పారముగాబరపించిరక్తపున్
సోనలువేమరుల్ గురియ • సొక్కుచు సోలఁగఁజేసిర్ రణ
స్థానమువీఁడకింతయుస • దాధృతితోసికతంపుఁ బాఱితరల్
పోనియటుల్ నసుగ్గవియఁ • బోరొగిభోరని తారసిల్లఁగా ॥ 23

ఎన్నిమారులు నిలువరించినను సైంధవుని ప్రాణములాగుఁటాగుఁ గనఁబడదు ధనుంజయుండప్పుడె మూలబలము జీరినట్లుగాననయ్యె పోనిమ్ము ఎవరి కర్మము వారిది నాయోపినంత పట్టు సమరధర్మ మారడివుచ్చకయేన డుతును. తరువాత దైవవశము ఆదైవమనఁగా నెవ్వఁడు ? దేవకీనందనుఁడగు గోవిందుఁడే (పరికించి) అదేమి రారాజు దుస్తేజుఁడైయాజీవదలి నాజతనంబునకు రోజుచునె తెంచుచున్నాఁడు మోముఁజూడరోష కషాయితమయి యొప్పుచున్నది. ఏమిమూడునోకదా ?

దుర్యో— (ప్రవేశించితనలో)

గీ॥ ఏదిద్యోఁ సంఘుత్వ్యముఁ • దేవుఁ డెందుఁ
దలకొకని పెత్తనం బైన • పద్ధమగును
కట్టఁగట్టిన చీపురు • చిట్టిపుడుక
లట్టివిఱుఁగున బ్రె • యత్నమందుఁ గాక॥ 24

(ప్రకాశముగా) కుంభసంభవా! నమస్కారము.

ద్రోణు — రాజరాజా? ఇష్టప్రాప్తిరస్తు.

దుర్యో — (వికటముగా)

గీ॥ తమరివంటియోధులు రణ • ధరణియందు
మెలఁగనిష్టములకులోటు • కలుగఁగలదె

ద్రోణు — ఏమిఁయిట్టులవికటంబు • లెసఁగుచుంటి
వెట్టిలోటులుయోధుల • కిపుడుగలిగె? ॥ 25

దుర్యో — మహానుభావా! లోటేమున్నది

గీ॥ కప్పయెలుఁగుపాములు తేనెఁ • గప్పఁబడిన
కత్తులీరణమునఁదిరు • గంగఁగంటి
నందుముఖ్యుఁడవీవై తి • వనఁగలానె?
యెంతచెడినశిష్యుండనై • యేడ్వఁబట్టి ॥ 26

ద్రోణు — ఏమేమి? సుయోధనా! నీవేనాయిప్పుడు మాట్లాడుచున్నది? జయము కావలసినవాఁడవేనా నీవు? నాయందుగురుత్వమున్నదా నీకు? ఏమంటి వేమంటివి? (కప్పయెలుఁగు ...... పూర్వోక్తపద్యమునుజదివి) నిదియేనా? నీ తెలివికిచాలసంతసించితిని.

గీ॥ కొండెములుజెప్పుదుష్టక • ర్ణుండొకండు
మప్కరతగల్గునీదుత • మ్ముండొకండు
కీడులమునకునాశంబు • నిక్కముగను
దేసమిర్ధులైనమున్మ • దిట్టిదేల? ॥ 27

దుర్యో — (కోపముతో)

ఉ॥ చాలునుజాలునింకమఱి • జాలియొకింతయులేకయంగభూ
పాలునిదిట్టఁజొచ్చితివి • పాపమటంచుఁ దలంచకేనరుం

జాలము సేయఁబోవఁ బ్రియ ♦ మైమెున దాఁటఁగనిచ్చితేర ! పా
ల్మాలికఁజేసి సైంధవుని ♦ మాకిఁకదక్కఁగ నియ్యనయ్యయో ! ॥ 28

ద్రోణ— దుర్యోధనా ! బాగుగా వాఁగితివి.

చ॥ అగునగు నేనెనీకిచట ♦ నంతయు మోసము పెక్కుఁజేసిన
ట్లగపడుచుంటవింతలగు ♦ నా మును నాద్రుపదాత్మజాంగనన్
నగఁబోగులంగఁజేయు తెగు ♦ వక్ నినుఁజుట్టుకయున్న వన్నెఁగా
వఁగఁదరమా ఖలాత్ములను ♦ బారుఁడ? నొఁక పెద్దనాయిటన్ ॥ 29

నీనీచబుద్ధి భోనిమ్ము కొఁటివిగావు నాయథాశక్తి వినియోగించి నరు నిలువరింపఁ జాలకున్నను వాని సహాయమొనర్పఁబోవు నీపాండవుల నాటంకవఱచు నాపై నీవీయపవాదము వేయ సాహసించితివే ! సైంధవుఁగాపాడుకొనుట కైయే కదా నీయాప్తవర్గముతో సమగ్రముగానిల్చి నన్నొక్కని నీ మొననేడువమనిరి. కాని ! కానీ ! కృతఘ్నులకుఁ జేయునుపకారము నూనెసదను. కొండెముల ముండకొడుకగు కర్ణుండుండెఁగదా ! నామాటయేటికి వాఁడుండువఱకు నీ మొండిబుద్ధి యిట్లనేయుండును.

దుర్యో—(అర్థోక్తియందే)

ఉ॥ కొండెము కొండెమంచుఁగడు ♦ గ్రూరముగావచియించెదేలనీ
ఖండనధర్మమొక్కఁతటి ♦ బాగుగఁగాంచుమి నిన్నరేయి నే
నుండఁగనేటిభీతియని ♦ యూరక సైంధవుఁ జంపనుంటిపో
రుండవొ నీవుమాగఱణగు ♦ రుండవొ మాకిటుమారకుండవో? ॥ 30

ద్రోణ— సెహభాష్ ! చెప్పుదెబ్బ గొట్టితివి. నీవనినట్లు నేనిప్పుడే కాదు పారుఁడఁ గాక పోవుట !

సీ॥ గాలిచూలికివిూరు ♦ గరళంబుఁబెట్టఁజూ
చిననాటనుండి బ్రా ♦ హ్మణుఁడఁగాను
లాక్షాగృహదహన ♦ మీక్షించిలజ్జతో
నూరకుంటినమె ధరా ♦ మరుఁడఁగాను
కపటంపుజూదంబుఁ ♦ గాంచియూరకయున్న
రోజునుండియును బా ♦ రుండఁగాను

పాంచాలీమానంబు • భంగించు మిముఁ జంపఁ
దివురని నాఁడె నే • ద్విజుఁడఁ గాను

గీ॥ సూనృతాలాపులగు పాండు • సూనులందుఁ
జేరకే యధర్ములగు మీ • వారిఁ జేరి
బ్రాహ్మణత్వముఁ జెఱచి దౌ • ర్భాగ్యుఁడైతిఁ
గాన నేటికి దూషింప • మానవేంద్ర ! ॥ 13

ఛీ ఛీ ! నీబుద్ధి తెలియవచ్చినది. చచ్చి చెడి నేనిచ్చటఁ బోరి పొచ్చెము లేక యీపాండవుల నిలువరించుచుండ నిదియంతయుఁ బోయినదేమి ? ఇఁక నేదియో మూఁడుననియెంచి నామీఁద నీలాపనింద న్యాయముగా నున్నదియా ? గదాయుద్ధపారీణుఁడవని పెద్దబిరుదుఁ దగిలించుకొన్న నీవును బాణవిద్యా కౌశలుండని పేరుపొందితి ననుకొనుచున్న నీనెచ్చెలి కర్ణుండును నర్జునుని నిలువరింపరాదా ? ముసలిబాపని నేనొక్కఁడ నేనా నీకు దొరికితిని. పడుచు తనపు గర్వముచే మిట్టిపడుచున్న నీతమ్ములేమైరి నీముద్దుల మేనమామ రాజ్యమంతయు బహున్యాయముగా నార్జించి యీవాలముద్దం జేసి నీకర్పించిన మహాత్ముఁ డిప్పుడేమేనియు సహాయము చేయలేక పోయినాఁడా యాశకునిగాఁడు. పోపొమ్ము యిట్టి యసంబద్ధపు వాక్కుల వక్కాణింపక బుద్ధి తెచ్చుకొనుము.

దుర్యో— మహాత్మా ! (పశ్చాత్తాపముతో)

గీ॥ తమసెలవురీతి నడువను • త్రమముగాదె ?
కార్యశూరత నాదువా • క్యముల లెక్కఁ
గొనక పుత్రునివలెఁ జూచి • ననుక్షమించి
పోవ సెలవిందు దీవించి • పోరిలోకి ॥ 32

మఱియు నాచార్యవర్యా !

క॥ తృటిలో సైన్యమునంతయుఁ
బటుబాణప్రహతిఁ గలఁచు • పార్థుఁగని నే
నటు నిలువలేక పల్కితిఁ
గటువాక్యంబుల క్షమించి • కావుమినన్నున్ । 33

(అని కాళ్లపైఁబడును)

ద్రోణు— [లేవఁదీసి ప్రసన్నుఁడై] లేలెమ్ము ! రాజా నీవు నలవాయశ్శ్రద్ధాపు యు నొకటియే కాని వేఱుగాదు. నీపల్కుల కొంతయుఁ జింతలేదు. నేనొక కవచమిచ్చెద దీనిఁ దొడిగితివా నిన్నెవరుఁ జయింపలేరు, దానితో నిప్పుడపోయియర్జును నెదురించుము పొమ్ము నేనిక్కడ జాగరూకుఁడనై యుండవలెను. [అనికవచమిచ్చును]

దుర్యో— [తీసికొని] గురూత్తమా ! సెలవా ?

ద్రోణు— సరే ! పొమ్ము.

నిష్క్రమింతురు.

## 3 వ రంగము.

ప్రదేశము-రణభూమియందు    ప్రవేశము-కృష్ణార్జునులు రథారూఢులై

కృష్ణు— అర్జునా !

గీ॥ ప్రొద్దుపొడిచినప్పటినుండి ♦ పోరుసలుపు
చుంటి వెుక్కరీతివిసుగు ♦ నొందక హాహా !
యేమిచెప్పుదు నశ్వంబు ♦ లెంతమాత్ర
మైన నడుగాకున్న వలుగుల్ ♦ మోసనంట ॥ 34

సైంధవుఁడుఁజాలు దూరములోఁ గాన్పించుచున్నాఁడు సైన్యను దెగటెంపుజేసి ముందునకు సాగకుంటివి. ప్రొద్దునుజాల వ్రాలినది. సాకు నేమియుఁ దోఁచకున్నది.

అర్జు— ఏటికన్ని చదివెదవు ?

గీ॥ ప్రొద్దుపోయిన నేనెట్లు ♦ దిద్దగలను
అడ్డువచ్చువీరులవీడి ♦ యరుగనగునె ?
రథ్యములకలసటమైన ♦ రథముఁడిగియొ
పోరుమునునంతలోవాసిఁ ♦ బొందువటము ॥ 35

కృష్ణు— [ఆశ్చర్యముగా] ఏమియీసాహసము. త్వరితరథముఁదిగి యిట్లొకచోఁ బోలెదవు ?

అర్జు— బావా ! నీయవ్యాజకరుణా కటాక్షము లేక్షణములో నాపైఁబడెనో యప్పటినుండియే నాకీసామర్థ్యము. యెందులకీవృథా వాదము. దిగుదిగు నీవు గుఱ్ఱముల బాగుఁజేయుము. [కృష్ణుఁడుదిగఁగా నేదానునుదిగును.]

కృష్ణు— పార్థా ! నేఁబోయి యచ్చట నే బాగుజేసుకొని తీసుకవచ్చెద .

(అనిరథముతో నిష్క్రమించును)

[నేపథ్యమునఁగలకలానంతరము.]

గీ॥ అర్జునామవ పైనిని ♦ వ్యాస్త్రసమితిఁ
బర్వుచు బలంబులే తెంచెఁ ♦ బదిలముసుమి
గాండివాపము కశరాళిఁ ♦ గాపరంబ
డంచి మాదురక్షణముఁగా ♦ వించుమిపుడు ॥ 36

అర్జు— గీ॥ నందనందన | యిందుఁగం ♦ దొంద నేల!
కాంచువారి దగ్ధంబుఁగా ♦ వించుచుంటి
దివ్యశరపరంపర లేసి ♦ తృటినినిపుడు
గుఱ్ఱములమాత్రమీవుబా ♦ గుసవరించు॥

(అనిబాణములేయఁ బెద్దయగ్నిజ్వాల కనంబడును)

కృష్ణు— ( ప్రవేశించి యానందమున నర్జునుఁ గౌఁగిలించుకొని )

చ॥ అరరె! విరోధిమధ్యమున ♦ నశ్వములన్ సవరింపఁ జేయున్
వరశరశక్తియద్భుతము ♦ పార్థ ! యిఁకొక్కటి ముచ్చటించెదన్
వారులు జలంబుఁగోరియన ♦ యంబునొగర్పుచునుండెఁగావునన్
సరగున వానికిన్ జలమె ♦ సంగినగాని మెలంగలేవుసూ 38

అర్జు— బావా! నీకరుణయునది యున్నయెడల నది యెంతపని? చూడుమిప్పుడు-

గీ॥ నేనే పితృభక్తుఁడనయితి ♦ నే నిసురలు
నన్నుమెచ్చుట నిజమేని ♦ యన్నధర్మ
జుఁడిలసత్యవంతుఁడేయేనఁ ♦ బుడమి పగిలి
జలము బైటకెగరెడినా ♦ శరవరమున॥ 39

(బాణమేయ భూమినుండి జలము జుమ్మని యెగురుటతోడనే దుందుభులు తదువాత్ నాకాశమున)

మ॥ భళిరే! యర్జున నీదుశౌర్యగరిమన్ • వర్ణింపఁగా శక్యమే
నరనారాయణులన్న మీరలెకదా • నవ్యప్రభావంతులై
ధరణీచంద్రిభసూర్యమున్ దమయశో • ధావళ్యమున్ బర్విభా
సురసంపత్ప్రభులై విరోధివారులై • శూరాత్ములై కాలుతన్ 40

కృష్ణ— అర్జునా! వింటివా! దేవతలపలుకులు (అనిలోనికిఁబోయి రథముతోఁబ్రవేశించును)

అర్జు— రథమధిష్టింతునా (అని యెక్కి)

కృష్ణ— [తానునెక్కి] అర్జునా కనుంగొనుమీవాజులవేగము! నీయాశుగములకన్న వేగముగాఁబోవుచున్నవి సుమా!

(అంతఁదెరలోఁ బెద్దకలకలము)

కృష్ణ— ఏమిదియింతచప్పుడు

అర్జు— మఱేమియులేదు. రారాజుగారి సంరంభము నాచేతి శాతబాణములఁ జవిజూచుటకై యేతెంచుచున్నట్లున్నది.

[తెరలో]

శా॥ ఓరీ! యర్జున యోరి! కృష్ణ! నిలుఁడీ • యెక్కింతసేపచ్చోటన్
రారాజాశుగజాలమేయుచుభవ • త్ప్రాణంబులన్ బీల్చెడిన్

అర్జు— రారా వేగమెబీరమేల పశువా! • రారాజవే నీవునున్
ఘోరాజిన్నిను దుష్టమార్గణములన్ • గుప్పించి యేడ్పించెదన్ ॥ 41

దుర్యో— [సారథిద్వితీయుఁడై రథముపై బ్రవేశించి] అరె! దుష్టాత్మా
శా॥ ఏమంచిప్పుడు పల్కితోరి తులువా • హీనప్రచారాత్ములై
భామన్ బల్వురు కూడుటే యశముగా • భావించితే బాలిశా!

అర్జు— భామన్ బల్వురు గూడుటేపరునియం • బన్ గూడయత్నించుటో
యేమో చూతము ముందు నాకు రణమి • మ్మింతేని ధైర్యంబుతో॥ 42

కృష్ణ— కురురాజా! శూరమ్మన్య!
ఉ॥ శూరుఁడవైరణస్థలియ • శోలలనాదరణాదటన్ గనన్
బీరములాడనేల గెలు • పే వినుపించును శౌర్యధైర్యముల్

దుర్యో— పీరుడనేనటంచుఁగడు • బ్రేలకుమోరి మురారిభీరువై
ద్వారక నీటఁగట్టితివి • దానికతంబుఁ దలంచుకొమ్మికన్॥

ఛీ! ఛీ! నీపౌరుషము గూడ లెక్కకుఁ దెచ్చుకొని మావంటి
శూరుల నధిక్షేపింపఁజొచ్చితివి . చాలుఁజాలునింక నూరుకొని
మావంటివారలకుఁ దేరుఁదోలి బ్రతుకుము

కృష్ణ— ఔనౌను నీవంటిశూరుఁడనే నెట్లగుదును నీచేసినయుద్ధము లొకటియా రెం
డా! నీపాట్లు నీకేజ్ఞాపకముండవు నేఁజెప్పెదవినుము

గీ॥ ఏనునీవంటి వీరుఁడ ♦ నెటులనగుదు
ఘోషయాత్రలఁజేసిగ ♦ గ్గోలువడితి
నా? విజయుచేతఁగొప్పగో ♦ యఁగఁబడితి
నా? తమరిబోటిశూరుఁడ ♦ నాటకెందు? ॥ 14

దుర్యో— నిక్కముగాఁగానేరవు

అర్జు— [అధోక్షియందే]

గీ॥ ఓరి! దుష్టాత్మ యిప్పుడైనఁ ♦ జేరిశరణు
వేఁడిన విడుతుఁగానినీ ♦ పీచమడఁతు
దేవదేవుని విష్ణునిఁ ♦ దిట్టగఁడఁగి
తొర! యోరికురుకులకు ♦ తారకూర్ర ॥

దుర్యో— [అర్జునుతో] ఛీ! ఛీ! మూఢాత్మా! సిగ్గులేక యేమనిబోయితివిరా కుక్కా

చ॥ తినుటకుఁ దిండిలేకయతి ♦ దీనతఁగానలఁ బట్టియేడ్చునీ
యనుజులు నగ్రజుల్ కలిసి ♦ యాయదువంశకుతారుపాదముల్
వినయముతోడఁ బట్టుచురు ♦ వేదవిదుండని రాజ రాజనా
ప్రణమదరాతుడక్ బహువు ♦ పాదముఁబట్టఁగనాకు నేటికిన్ ॥

అదియుఁగాక శతాత్మ! దుర్మార్గుఁడగు నీవు సరిపోయినదికాని యీవే
సతుక్కలమందుఁ బుట్టినవాఁడవైన నీవెట్టిగొల్లనిఁ జేర్చుదువా?

కృష్ణ—ఓరోరిమరాత్మ నీనెలతక్కువగుణంబులు పోనిచ్చుకొంటివికావు నీవునెప్పుడు
నిదియేయేడ్పయిపోయినది కానీనునిమాటల వీనులఁబెట్టి సీనోటికివచ్చిన ట్లెల్ల
చేర్లగడఁగితివి నీపోకాలము తటస్థించినది. ఇఁక నెంత మైదారుపనా
యీయార్భాటము ఇఁకనైన బుద్ధిఁదెచ్చుకొని నీదాయాదులగు పాండవులఁ
సి సుఖింపుము

దుర్యో— ఓరోరి! తుచ్ఛా! పాలుబోతా! యింతయుద్ధము జరిగిన తరువాత సంధిఁ జేయవచ్చితివఁటరా ఖలాత్మ! యిప్పుడు నా బాణాగ్నిజ్వాలకు శలభములు కాక బ్రతుకుడు తరువాతఁ జూచికొందము.

అర్జు— చెట్టుచచ్చుకాలమునకుఁ బుట్టుకుక్కమూతిపిందెలవలె మీకులము నాశన మొనర్పఁ బుట్టితివిరా పశువా! మీపాపములువర్ణించుటకు సరియైన పదములేవురా! మీరలుద్భవింపకయే పోయిన నీకులమున కీర్తిచేటుమూఁడు నా ? యీదేవదేవు దిట్టునీనాల్క పడకుండుటకు కారణమునీకర్మానుభవ మింకఁదీఱలేదు

దుర్యో— ఓరోరి! జాల్ముఁడా! నపుంసకా! స్త్రీవంచకా! నీబోటియాఁడముండల కీతఁడు దైవము కాబోలునేమి. యితఁడే దైవమా మాధుఁడా నక్కయెక్కడ దేవలోకమెక్కడ ?

మత్తకోకిల— చాలుఁజాలునిఁకేమికావలెఁ ♦ జక్కఁబల్కితిమూఢుఁడా
యాలగాపరియైనగొల్లఁడ ♦ హావికుంఠనివాసుఁడే
పోలఁజూడఁగనింద్రజాలిక ♦ పూరుషుండుమహాత్ముఁడే
యేలయింకవృధావివాదము ♦ లిద్దరిన్ సమయించెదన్॥ 47

అర్జు— కృష్ణా! పాకము ముదురుచున్నట్లున్నది! సెలవా ?

కృష్ణ— అతఁడే సెలవడుగుచున్నాఁడు జాగేల ?

అర్జు— ఓరోరి! దురాత్మ (బాణము వేయవానికిఁ దగలకయేకిరించపడును)

కృష్ణ— (ఆశ్చర్యముతో) గీ॥ అర్జునా! యేమిచిత్రమీ ♦ యధమునకును
బాణజాలంబుదగులక ♦ మానియుండె

అర్జు— ద్రోణుఁడిచ్చినకవచంబు ♦ వానినిలిపె
గానియిప్పుడెసమయింతుఁ ♦ గాంచుమిత్రుట॥ 48

కానిదే సర్వకవచఘ్నంబను దానిసంధించియేయుచుంటిని
(యేయఁదాని నశ్వత్థామ నఱకును)

కృష్ణ— అయ్యో! దీనినడుమనే యశ్వత్థామత్రుంచినాఁడు పోనిమ్ము మఱి సంధించుము.

అర్జు— కృష్ణా ?

గీ॥ దీని నేరనుమరలసం ♦ ధింపరాదు
కానఁగాంచుము నేనుసం ♦ గ్రామభూమి.
వాని చేత నెకవచంబు ♦ వదలఁజేసి
పారఁగొట్టుదుశరపరం ♦ పరల నేసి॥ 49

[అని బాణములేయ దుర్యోధనుని సారథి రథ్యములు గూలును.]

దుర్యో— [తనలో] ఆహా !

క॥ ఏమీ యీతని శౌర్యము
సామంతంబగు కవచము ♦ జక్కఁగ దునిమెన్
నామానము దక్కె నెసం
గ్రామాంగణమందు నిలువఁ ♦ గాఁ బారవలెన్ ॥

(అని పాఱిపోవును తోడ వీరును నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము





ఓమ్

శుభమస్తు.

# సైంధవార్జునము.



## పంచమాంకము.

ప్రదేశము-రణభూమి

ప్రవేశము-పూర్వోక్తభటులిద్దరు.

1 వ భటుఁడు-బావా! బ్రతికియున్నావా?

2 వ భటుఁడు-చావఁగా మిగిలినాను.

1 వ భ-ఎవరుచావఁగా మిగిలినావు?

2 వ భ- నేనే.

1 వ భ—నీవుచావఁగా నీవెయెట్లుమిగిలితివి?

2 వ భ—అదే! చిత్రమా? నాదేహమిప్పుడు చావలేదు నాప్రాణములు చచ్చినవికను
కనే నేను చావఁగామిగిలినాను.

1 వ భ—నీప్రాణములు చచ్చి నీదేహములేదనఁగ?

2 వ భ—నీమొగము! చంపుచున్నావు! పెద్దమ్మా! నాప్రాణము లీలోకములోనే వు
నాకన్న ముందేగి యచ్చట నాకుఖస మొదలగునవి గుదుర్చుటకుఁ బోయినవి

1 భ— ఎక్కడ?

2 భ— వీరస్వర్గములోఁ

1 భ—అదెక్కడ

2 భ—అది యిక్కడకు దాదాపుగా రెండుమైళ్లుండును.

1 భ—నీప్రాణములకుఁ దోడెవ్వరులేరా?

భ—లేకేమి డబ్బది పద్దునొకండుగురు ముందేగినారు.

1 వ భ—ఈకందాయింపంతా యెవరు?

2 వ భ—ఇంక నెవ్వరు మనపాలిటికీదినమర్జునుండే!

1 వ భ—అయిన నీప్రయాణము నిశ్చయమన్నమాటే?

2 వ భ—నీతోపాటే!

1 వ భ—నేనీకందాయింపులోరాను.

2 వ భ—మఱియెవ్వరున్నారు?

1 వ భ—సరి సరి యెఱుంగరాయేమిటి? అర్జునక్షేమంబు తెలియక సాత్యకి బ్రతిమాలి ధర్మరాజుగారు మనపాలిటికి యమధర్మరాజులాగున నే పంపినారు

2 వ భ—ఆం! ఆం! మన మునలాని దాంటినాండావాండు?

1 వ భ—ఒక్కనమస్కారము లంచముం గొట్టులోనికిం బోనిచ్చినాండు

2 వ భ—అయిన నీవుగూడ సిద్ధమేయన్నమాట

1 వ భ—ఆ!

2 వ భ—మఱిపదపద

(నిష్క్రమింతురు)

## 1 వ రంగము.

ప్రవేశము—రణభూమి ప్రవేశము— ధర్మజ భీములు

భీముండు— మహాత్మా!

శా॥ అన్నామీరిటు దుఃఖమొందందగునా ♦ యాపంతయున్ జెప్పకే
యెన్నండైనభవద్వచోనియతికిం ♦ తేండప్పి నేనుంటి నే
మన్నింపన్ దయంజూచినాకుంద్రుటినిన్ బ్రి ♦ హ్మాండమాకార్యమై
నన్నిండారుముదంబుతోం దెలుపుండా ♦ నందంబుతోంజేసెదన్॥

ధర్మ— (కన్నీటితో) అనుజా భీమసేనా!

మ॥ మునుముందొక్కటి పాంచజన్య నినదం ♦ బున్ వింటి నేకాని పా
ర్థునిశంకధ్వనిరాక సాత్యకిని నెం ♦ తో తొట్రుపాటొందిపం
పినవాండున్ నరుంజేరవట్లగపడెక్ ♦ భీమంపుసంగ్రామమం
దున నెట్లుండెను యర్జునుండకట!

(అనిపైంజెప్పలేక భీమునిం గౌగలించుకొనియేడ్చును)

భీము— ... ... గం • దున్ బొంద నేలన్నయా!॥ 2

(అని కూర్చుండఁబెట్టును)

అగ్రజా! శాంతింపుము

ఉ॥ శోకము బొంద నేలమదిఁ • జూచిన నాతని కేమి లోపమా
హా! కమలావిభుండరద • మాలములో నొగలెక్కి తోలఁగా
నాకపి శేఖరధ్వజము • నల్లలనాడనభంగ వాజులై
నాకవిభూద్భవుండు కద • నంబున గాండివ మెక్కువెట్టనే
లోకమునంగలండతని • రోషకషాయిత దీప్తిఁజూడఁగా॥ 3

కావున నావంతయు వెఱవఁ బనిలేదు యధేచ్ఛనైతమరిచ్చటఁ బొరిపొచ్చెములేక యుద్ధముజేయవచ్చు.

ధర్మ— తమ్ముఁడా!

గీ॥ ఎన్ని సెప్పిన నామన • సేమొకాని
నెమ్మదించ కభయముతో • నిండియుండెఁ
గాన నెట్లైన నీవిప్డు • వానిఁజేరి
విజయవార్తలఁద్వరలోన • విశదపఱచు॥ 4

భీము— గీ॥ ఏనెయిటనుండిపోయిన • నగురుండు
తనప్రతిజ్ఞల నెరపనే • మనఁగలాను

ధర్మ— నెరపుటెట్టులవానిస • మరమునందు
జంపఁబుట్టుదృష్టద్యుమ్నుఁ • డింపుఁజెలఁగ॥ 5

తమ్ముఁడానీవెన్నిజెప్పినను నామనసున్నన కెక్కుటలేదు నాకై చింతింపవలదు. నీవేగక తప్పదు.

భీము— అట్లైన నోయగ్రజా! నీయిష్టము వచ్చినట్లేయొనర్చెదను శాంతులరగుము
(తెరవంక దిరిగి) బావా! బావా! (అనిపిలుచును)

దృష్టద్యుమ్నుఁడు—(ప్రవేశించి) బావా! నమస్కారము (ధర్మజునకు నమస్కరించి)
వృకోదరా! ఏమిరావించినది?

భీము— ఏమియులేదు

గీ॥ పూజ్యుఁడగు ధర్మజునిపట్ల • పూన్కితోడ
జాగరూకుఁడవై యుండ • సమయమయ్యె

నేనిదే యర్జునునిజాడ • నేగుమంచు

నాజ్ఞజేసిన వల్లెయం • చరుగుచుంటి॥ 6

దృష్ట— బావ!

చ॥ కరువలిచూలి! యేటుకిటు • గట్టిగనన్యునకున్ వలెన్ వచిం

పరణములో గురుండునర • పాలునిఁ గన్నులనెత్తి చూడఁగాఁ

దరమఁటె నాదుప్రాణమున • దాతను వందుమిలంగుచుండఁగా

సరగునఁబోయి ధర్మజుని • శంకలఁదీర్పు బకాసురాంతకా॥ 7

భీమ— అట్లయిన నేనిదేపోయెద! మహాత్మా! సెలవా (ధర్మజునమస్కరించి)

ధర్మ— (సంతోషముతో) పోయి వేగమే వానిఁ జూచినట్లే సింహనాద మొనర్పుము.

భీమ— చిత్తము (నిష్క్రమించును)

ధర్మ— ద్రుపదాత్మజా! కనుంగొనుమప్పుడె ద్రోణుని మనభీముఁడు సమీపించి నాఁడు ఆహా!

దృష్ట— బావా! చూడుమా ధనురాచార్యుఁడా ఖగశతంబులఁబుంఖానుపుంఖంబుగా నపారపారావారమగునట్లు కృపారసంబు చిలునగవు నెపంబున జైటకు వెలువడుచుండ మన వృకోదరు దాకినాఁడు అయ్యో చూడనేలేదు మన గాలిచూలిచేఁ జాలసైన్యము గూలినదిసుఁడీ

ధర్మ— వినుమా మహానుభావుఁడగు కుంభసంభవుఁడేదియో మందహాసముతోఁగూడిన ముఖారవిందమునంద మొంద వాక్రుచ్చుచున్నాఁడు

(తెరలో)

క॥ చలమున వసునీవిటనీ

బలమొప్పఁగ గెలిచికాక • వశమే మొనకున్

గలయక సారఁగా నీత

మ్ముఁడనుమతుండీయియొకాడె • మొనసారఁగఁబోకే॥

దృష్ట— (సంతోషముతో) బావా! ధర్మరాజా కాంచుము కాంచుము.

గీ॥ తమ్ముని విషయమనినవా • క్యమ్ములకును

కోపరసముబ్బ బెబ్బులి • కూకలట్ల

బొబ్బరించుచు మొగమెరు • వ్రగదురంగ
భీకరంబుగఁబల్కెడి • భీముఁడిదిగొ॥ 9

(తెరలో)

క॥ ఏమీ మానవుఁడొక్కట
సామాన్యపురథికుఁడడిగి • సైన్యముఁజొరు నే
భీమపుసురబలమైనన్
దామసగుణఁబలుపుఁగాక • ధనురాచార్యా॥ 10

ధర్మ— అయ్యో! ఇంక నేఁటియో యనుచున్నాఁడు వీనితో నెప్పఁడును సాహసించక పోయెఁగదా

(తెరలో)

చ॥ మొనఁజొరఁగా భయంబున న • మోనమయంబు ప్రియంబునల్పున
ర్జునుఁడను గానుసుమ్ము పటు • రోషకషాయితదీప్తిలేక్షణ
ప్రిణమదరాతిజాలుఁడఁగ • రాళగదాలలితుండ ఖండనం
బున గురువంచునిన్ వదలఁ • బోలునె శత్రుఁడనై మెలంగఁగా॥

[తరువాతఁ బెద్దకలకలము]

ధర్మ— [ఆతురముతో] ఇఁక నేమున్నదిఁక నేమున్నది! కట్టా! ద్రుపదాత్మజా!
మ॥ గదసారించిమహోగ్రకోపము జెలం • గన్ ద్రోణుపై నేయన
య్యది పృథ్వీతలమెల్ల జల్లదరఁగా • నాశ్చర్యమైపోయి వే
చదిపెన్ సారథిరథ్యముల్ రథముతో • జచ్చెన్ గురుండక్కటా
కదనంబిట్టుగ రూత్తముల్ చనుటకే • కాబోలుఁ గావించుటల్॥ 12

దృష్ట— మహాత్మా! విచారించెదరేల!
గీ॥ గురుఁడితరులచేఁగూలుటల్ • జరగునటవె?
వానిమృత్యువు నేనైయె • పరఁగుచుండఁ
గాంచుమామూలమెలమెల • గదలుచుండెఁ
బృథివికినిదాఁటి దెబ్బద • ప్పిశోనఁబోలు!! 13
భయములేదు వగవకుఁడు:

[అంతఁ దెరలోఁ బెద్దకలకలము]

ధర్మ— అదేమికలకలము?

ధృష్ట— మఱేమియులేదు. ద్రోణుని పరాభవము గన్నులారఁజూచిన మనవారి భేరీనినాదములు నుద్దండభుజాదండుఁడైన భీమసేనున కడ్డురాలేక పాఱిపోవు కౌరవులయార్పులును జయోత్సాహుఁడై మన గాలిచూలి చేయు సింహనాదము నొకపెట్టనంత కలకలమైనది

ధర్మ— కనుగొనుమల్లదె మఱలనొక తేరుగూర్చుకొని వడముడికడ్డుపడి జెడిదములగు నంపజొంపములు గుప్పించుచున్న యాద్రోణుని

ధృష్ట— [పరికించి] అదేమి భీముఁడు తేరుడిగ్గ నుఱికినాఁడు
[మఱలపరికించి యానందముతో] హాయి! హాయి!
బావగారూ! పరికింపుఁడు మీతమ్ముని పరాక్రమము

గీ॥ బిట్టువానకుఁదలయొగ్గు • వృషభమట్లు
దిట్టరియయిపోయి గురుని • తేరుచేత
బట్టివిసరివిసరిపాఱ • వైచెనహహా!
యిట్టిధీరుని నేనెందు • నెఱుఁగనెఱుఁగ ॥ 14

(తెరలోఁబెద్దకలకలము)

ధర్మ— (సంతోషముతో) ద్రోణుఁడల్లదిగో మెలమెల్లఁగఁ దెల్లమొగముతో మొనకు బాఱివచ్చుచున్నాఁడు.

కృష్ణ— బావా! బావా! పరికించుమదే దూరముగా నాబకాసురాద్యనేకరాక్షసాంతకుఁడైన భీమునకెట్లు కురుసైన్యము వెన్నిచ్చిపరువం జొచ్చినదో!

ధర్మ— దూరముగా నుండుటచే నంతగాఁ గనంబడలేదు.

ధృష్ట— ఔనౌను.

(తెరలో సింహనాదముతోఁ బాంచజన్య దేవదత్త ధ్వనులు వినంబడును)

ధర్మ— (ఆనందముతో ధృష్టద్యుమ్నుఁ గౌఁగిలించుకొని) ద్రుపదాత్మజా! నాకు కర్ణరసాయనమగు సింహనాదము దానికిఁదోడుఁ బాంచజన్య దేవదత్తంబులు వినంబడియె నాశంకలన్నియుఁ దీరె. రమ్మపోయి యామొనఁజూచికొందము.

ధృష్ట— చిత్తము.

(నిష్క్రమింతురు)

2వ రంగము.

ప్రదేశము రణభూమి— ప్రవేశము పూర్వోక్తభటులిద్దరు

1వ భ— బావా ! నీకుమగలెందఱు ?

2వ భ— నాకు నీకుఁగలిపి ముందొక్కఁడేమగఁడు.

1వ భ— తరువాత ?

2వ భ— ఇప్పుడంతా వెరసి ముగ్గురు.

1వ భ— క్రొత్తమగని ప్రచారమెట్లున్నది ?

2వ భ— క్రొత్తమగనివలెనే యున్నది.

1వ భ— అనఁగ ?

2వ భ— అనఁగ నేమిటి ? యిద్దరుమగల ద్రోసిరాజుజేసివచ్చిన మగని కలపులకు గిరికుఱ్ఱు మనుటకును వీలుండదుకదా ! అందునని యింతకు కొంచెము సుకే కారమెక్కువ పడునట్లు చర్చర్లు నేవాఁడు. పైఁబైఁగొట్టుటకు సిద్ధముగా నున్నాఁడు (పరికించి) కాంచుమిదిగో కర్ణుని ముమ్మారు నఖ క్షతములకు బదులు బాణక్షతములఁ జేయనోర్వలేక పాఱవచ్చియు మఱ లఁజచ్చినట్లుపోయి కలియుచున్నాఁడు.

1వ భ— ఔనౌను అదినేకాంచనేలేదు (పరికించి) కనుంగొనుమా మూఢ దుర్యోధనునిదన స్నేహితుని పాట్లఁజూడలేక తమ్ములకుఁ జేయివిచి యేమియో వక్కాణించుచున్నాఁడు.

గీ॥ ఓరి! శత్రుంజయాసుదే • హాండసోరి
సోదరమ్ములార ! యిరజు • మీఁదనిల
ఝంపటుల ఘోరశరముల • జాండమదర
నేయుచుండఁ జూచెదవేల • యేగుఁడిప్పుడ ॥ F5

2వ భ— బావా ! చూచితివా యన్నచెప్పిన చొప్పునఁ బోయినయన శత్రుంజ యాదికురుకుమారుల ఫాల్గునస్వవిశిఖవాతిచే వారితలలు క్రిందవ్రాల్లు చున్నవి.

1వ భ— అయ్యయ్యో భీముని రథ్యములు నేలఁగూలినవి ఇఁకనేమున్నది

2వ భ— చూడమేవో భీముఁడుగ్రుఁడై వ్యాఘ్రముఁబోలి వ్రాకమ్ముచున్నాఁడు

(తెరలో)

ఓరోరి మూఫ్రాత్రా

గీ॥ కాంచుమిప్పుడె లేఖులో • కదలుచుగందు
వోర్తివాక్యూర । కర్ణనీ • వారుబెదర
(మరియొకగొంతుతో) ఓరోరి తిండిపోతా !
బెదరుటకు సేనుగానలోఁ • బారుగలేదు
ఆమలలములుదినుచు నే • నడలలేదు ॥ 16

2వ భ— ఆహా ! భీమసేనుఁడుగ్రుఁడై సమగ్రముగా నారిలాగి తనభుజశక్తి దెలియునట్టి లోకఘనశక్తి కర్ణునిపై వైచెను.

1వ భ— భయములేదులే ! కర్ణుఁడద్దానిమధ్యనే నఱకినాఁడు. అయ్యయ్యో మనఘుఁకొనునంతలో వృకోదరుఁడడరి యజ్ఞుఁడైన సూతిజుపైనురుకుటయు నాతఁడు భీరువై కేతనపుబల్లక్రింద నొరగుటయు భీముఁడద్దాని నెఱుంగక క్రిందకురుకుటయుఁ గర్ణుఁడుఁదోడనె బాణములేయ మొదలిడుటయు నయ్యో ! జూడుము.

1వ భ— బావా ! చూడుము పాపము.

గీ॥ తన్నుఁగాపాడుకొనుటకై • తెగినయాయు
ధంబులేక యర్జునుచేత • దళితమగు
జములఁ జేఁబట్టిశరములఁ • జదుపుచుండె
మోసముఖుజేయు సూతాధ • ముండు జెలఁగ ॥ 17

2వ భ— నారాయణ ! నారాయణ ! చుట్టుపట్టులనున్న పీనుంగుతిట్టలపై మూయుమైన బాణజాల నోర్వలేక మఱుఁగు వెదకుచున్న యావృకోదరుఁజూచి నన బ్బుబ్బు నాకడుపు చెఱువగుచున్నది.

1వ భ— బావా ! బావా ! అయ్యయ్యో ! ఏమిచెప్పుదును.

గీ॥ చేయునదిలేకఖిన్నుఁడై • సిగ్గువొడమి
మఱుఁగుజేరినభీముని • మొఱకుఁడగుచు
వింటికొలనుబొట్టను • నంటఁబొడిచి
ఫెల్లుకుమన్నాఁడు కర్ణుఁడు • కుల్కుయదిగో ! ॥

(తెరలో)

భీమా! తిండిపోతా!

ఆ॥ వె॥ ఓరి! తిండిపోత • పోరేల రానీకు
నిల్లుఁజేరి కుడువు • మెంతయైన
కన్నుఁగానకీవు • కదనంబులో మము
బోటివారిఁజేరు • టేటిబుద్ధి? ॥ 19

మఱియు

చ॥ వనములయందు నాకులను • బండ్లను దించు మెలంగ లేక యీ
రణమహీకేల వచ్చితిరి • రాఁదగునే యిటు సిగ్గులేక; వీ
వనిత పరాభవింపఁబడి • బాగుగనున్నదె? ధర్మజుండు యీ 0
గనియమముల్ చెలంగి సుఖి • గా? నరుఁడున్ బురుషత్వమంజెనే? ॥ 2

2వ భ— ఛీ ఛీ వీని బ్రతుకుగాల సిగ్గులేని యీ రకుక్కవలె తోఁక ముడిచి ముమ్మ్ర
రుఁ బాఱుటయేకాక ముసలిముండయైనఁ జేయనేరని పనిజేసి మోసపు
చ్చి తుచ్ఛపు విజయ మొందితినిగదా యని విఱ్ఱవీఁగుచు నెట్లు మాట్లాడినాఁడో
దుర్మార్గుఁడు. వీని కర్జునిచే నింతకింతయున్నది. చూడుము (పరికించి)
హాయి హాయి నేననినట్లయైనది! చూచితివా!

గీ॥ దూరమునసనుండి కర్ణుని • త్రుళ్లఁజూచి
ఫెళ్ళుమని బాణమెక్కటి • వింటఁదొడిఁగి
గొల్లటంచును రారాజు • గోలపెట్ట
ఘొల్లసేసెను గర్ణునా • గొల్లఁడలర ॥ 12

2వ భ— మనభీముఁడేడి పాపము..

1వ భ— తనసారథి విశోకుఁడు తెచ్చిన తేరెక్కి మఱలఁ గర్ణునిపై బడి భావజని
తక్రోపానలము జ్వాలారుషట్లు బెట్టిదములగు ప్రదరములఁ బుంఖానుపుంఖము
గాఁ బఱపుచున్నాడు.

2వ భ.— రారమ్మ మనపాలటిక్కొక్క బాణము చాలును.

1వ భ— సరేపద. పద.

నిష్క్రమణము.

(తోడనే కృష్ణార్జునులు రథారూఢులై ప్రవేశింతురు.)

అర్జు— (సందేహ సూచకముగా) బావా సాత్యకి పరాభవంబున నాకుగడుంగడు జింతదొంతరెక్కుచున్నది. నేఁజేసిన యీయధర్మముగూడ నాకేదియో సంశయము గలుగఁ జేయుచున్నది.

కృష్ణు— నీచేసిన యధర్మమేమిటి ?

అర్జు— పరుఁడగు సాత్యకితోఁ బోరుచున్న భూరిశ్రవుని భుజాదండ మూరకనె అనుటయే యధర్మముకాదా ?

కృష్ణు— బాగు బాగు యీలాగు నుండవలె ధర్మము.

ఆ॥ వె॥ నీదు స్నేహితుండు • నిర్మలశిష్యుండు ।
సాత్యకిని నతండు • చంపనుండ
వానిభుజమునలుక • దానినధర్మమ
టంచుఁబలుకుచుంటి • సహహాసివు ॥ 22

చ॥ పలువురు జుట్టుముట్టిపసి • వానిరథంబుఁ బడంగఁజేసితు
ల్వాలవెనుకేగివిల్తునిమి • ప్రాణముఁదీసిన ధర్మమేకదా ?
పలవురతోరణంబెసలు పక్షశ్రీము మొందతుదన్ బరాభవం
బులుబడుచట్టి స్నేహితునిఁ • బ్రోవనధర్మమె ? ధర్మవేత్తవో॥ 23

ఈధర్మ సూక్ష్మమింటిపద్ద సావకాశులమై యోచించుకొనవచ్చును గాని ముందుజరుగఁబోవు కార్యమాలోచింపుము. యేలయనిన

కు॥ రవియుండాజాలగఁ ప్రాలఁజొచ్చెనిటసం • గ్రామంబునన్ఘోరమ
య్యెవిరోధుల్ చలమొప్పనిల్చిరయయో • యెట్లింక నాదుష్టసైం
ధవునిన్గూల్తువో ?

అర్జు— కంటికికిన్ గనఁగన్నె • నన్ జంపుదున్ గానిచో
బవరంబుఁదునఁజంపు బెట్టికనుసం • ప్రాప్తించునో చెప్పుమా ॥ 24

కృష్ణు— [చిఱునగవుతో] కానిమ్ము నాచాకచక్యము గొంచెముజూతువుగాక

[అంత నాకాశంబంతయుఁ జీకటులగును]

అర్జు— మహాత్మా యదేమి యిట్లంథకారమైనది.

కృష్ణు— [చిఱునవ్వుతో] మరేమిచేసు

గీ॥ నాదుచాకచక్యంబునఁగ • సంగఁజేయ
మాయలాఁడనుగానని • మాయబన్ని
తపనుగప్పితినందుచేఁ • దమము పెరిగె
సంధ్యవేళనితోఁచుఁగ • సైంధవునకు ॥ 25

కావుననీకొఁద్వరలో వానితలనఱుక ప్రియత్నించుము.

(తెరలో)

గీ॥ సూర్యుఁడల్లదెయస్త్రాద్రిఁ • జొరఁగఁబోయె
సైంధవుని ప్రాణములఁబోవ • సమయమిదియె
యొక్కత్రుటిలోన నర్జునం • డుచ్చరించు
ప్రజ్ఞలెల్లను వ్యర్థమౌఁ • బదిలపడుడు ॥ 26

కృష్ణు— (ఆతురముతో) అర్జునా! యర్జునా!

గీ॥ తపనుఁడిప్పుడు వేగమ • స్తమయమందె
నంచు వేడ్కతోఁబడమర • నరయుచున్న
సైంధవుఁడదెకనంబడు • శంకలేల ?
శిరసునఱుకఁగాఁదగుగురు • శరము విడుము ॥ 27

అర్జు— మహానుభావా! కానవచ్చుచున్నాఁడు. (బాణము సంధించి భక్తితో)

మ॥ పరబాణంబ! త్వరన్ రిపున్ రణములోఁ బల్మిన్ కనన్ మెచ్చఁగా
సరిగాఁద్రెళ్ళఁగఁజేసిరమ్ము టకు నీ • శక్తిన్ విడంబించుచున్

[అని బాణమేయగానే]

కృష్ణ— [ఆత్యాతురముతో]

ధరపైనాతనిమస్తకంబుపడకుండఁగాఁ • దప్పోనునీవయ్యదం
బరమందాడఁగఁజేయుమిప్పుడు భవ • ద్బాణప్రయోగంబునన్ ॥ 28

అర్జు— మహానుభావా! దేవయాజ్ఞ శిరసావహించుచున్నాను.

(అని బాణమేయ శిరసుదివికేగి యక్కడనతని బాణకలన నాడుచుండును)

అర్జు— కృష్ణా ఏటికీవింత

కృష్ణు— మరేమియులేదు. యాతనితండ్రి యాతని మస్తకము నేల బడవైచినవా మూర్ధము వేయువ్రక్కలగునట్లు శపించెను. కావున నిద్దానిఁబాణ

ముచే వానిచేతిలోననే పడునట్లు చేయుము. వానిపటుము వానినెత్తిని గొట్టినట్లగును.

అర్జు— (అబ్బురముతో) ఆతఁడిప్పు డెక్కడనున్నాఁడు ?

కృష్ణ— కురుక్షేత్రంబున సంజవార్చుచున్నాఁడు.

అర్జు— అట్లైనసరే ! [అనిపాశుపతము సంధించి]

గీ॥ శంకరునిచేతమెలఁగున • స్త్రంబఁనీవు
నాపయినిదయఁగల్గిక్ష • ణంబులోన
నీశిరమ్మును వానిపి • తృకరమందు
పడఁగజైచుముజేయుదు • వందనములు ॥ 29

[అనిబాణమేయ శిరమెగిరిపోవును]

[అంతఁదెరలో]

క॥ ఎక్కడనుండియొ యీశిర
మక్కజముగ వృద్ధతపసి • హస్తమునఁబడెన్
వెక్కసమైయిలఁద్రోచిన
వ్రక్కలయెన్ వానిశిరము • వారండయ్యో ॥ 30

కృష్ణ— [అమితానందముతో నర్జునుఁ గౌఁగలించుకొని]

చ॥ గెలిచితిమింక సందరుసు • ఖింపనిలింపులకింపునింపునీ
బలయుదిగంతదంతురిత • పాండురకీర్తిన్ విరాజితంబయెన్
బలకిపునూన ! సత్యపరి • పాలన భీకరశత్రుశోషణా
యిలఁగలరే ! భవద్విశిఖ • బృందమునన్ భడకుండువారహా! ॥ 31

అర్జు— [చిఱునవ్వుతో] బావా ! ఆత్మస్తుతిఁ జేసుకొనెదవేల ?

కృష్ణ— ఆత్మస్తుతి యెక్కడదిక్కడ ?

అర్జు— ఆత్మస్తుతికాదా ? చుక్కానిఁ దిప్పవాఁడేపడవ బాగుగ నడచిన దన నెట్లుండునో యట్లుకాదా ? పోనియిదియే నాప్రతిజ్ఞయనిన నీకునాకుభేదము లేనప్పుడది యాత్మస్తుతికాదా ?

కృష్ణ— ఇదియా నీయాత్మస్తుతి ? నాసంతోషముపట్టఁజాలక యట్లంటిని. నీవనినట్లోడకుండ వలసినవిన్నియు లేకపోయినఁజుక్కాని యేమిచేయఁగలము.

అర్జునా! ఇప్పటికి మనమనుకొన్నవన్నియు సిద్ధించినవి. ఇఁక మనకేమైన కోర్కెలున్నవా?

అర్జు— మహానుభావా! కోర్కెలేటికి? అయినను గోరుమని సాక్షాద్భగవంతుఁడె యానతిచ్చుచుండ నేను గోరకుండరాదు కావున.

## మంగళమహాశ్రీవృత్తము.

ఏగృహము జూచినను • హేస్థలిని సంపదల • శాంతయువిరాజిలుచునుండఁగన్
త్యాగమును భోగమును • ధర్మము దమంతనెన • దావసుధవర్తిలుచుఁరాఁగన్
రోగరహితుండయిన • రుండుసతముక్తదనని • రూపితములైనపనులన్ స
ద్యోగమహితుండయి మె • లంగఁగవిరాజులుతి • రంబురహితోఁజెలఁగుగాతన్ ॥ 32

కృష్ణు— తథాస్తు. తథాస్తు.

(నిష్క్రమణము)

గద్య.

శ్రీమద్గాడేపల్లిశంకర సల్లలిత పల్లవితమల్లికా వల్లరీఫుల్ల కుసుమానుపమాన పవిత్ర భారద్వాజస గోత్రా సమానానుభవైక బ్రహ్మవిద్యాధురంధర వెంకటశాస్త్రిపుత్ర మిత్రానందదాయకు జనవిధేయమార్య నారాయణాభిధేయ విరచిత సైంధవార్జున నామ నాటకము పంచమాంకము.



# కీర్తనలు.

## (1) 5-14 నకులుడు—కరహరిప్రియరాగం—రూపకతాళం

పట్టిగుణముల పెట్టిబలమున • జెట్టియభిమన్యుండిలన్
గట్టిగను యీపద్మవ్యూహము • గుట్టెరింగిన వాడగున్ ॥ ప ॥
గట్టులుకయీ వీరులురువడి • ముట్టడింగొనదావడిన్
గుట్టుచెడి బడబాణతతులను । గొట్టకనుమానండొగిన్ ॥ ప ॥
యిట్టిదిట్టరి యీజగంబున । బుట్టడని నేనెరుగుదున్
బట్టియని సందియము నొందక । బంపుధర్మజవానికిన్ ॥ ప ॥
యిపుడు వీనిని బంపకుండిన । నీల్గుమన మోహరమెుగిన్
రిపులతో ద్రోణుండు నేడికృపుడు । వడిదురపిల్లగాన్ ॥

## (2) 7-28 అభిమన్యుడు—బలహంసరాగం—ఆదితాళం.

సెలవునిమ్ము రిపులబట్టి చెండి వేసెదన్ ।నిలువనీక కౌరవులను నలమి వంచెదన్ ॥ సె
తులువలైన వీరవరుల నిలను గలిపెదన్ । బలురథికులు నడల బాహుబలముజూపెదన్ ॥ సె
బలుసేనల బాణవహ్ని బాలుచేసెదన్ । దిటవునెరపి కీర్తినిలను దేజరిల్లెదన్ ॥ సె

## (3) 16-5 దుర్యోధనుడు—మలయమారుతం—ఏకతాళం

రక్షింపు రక్షింపుమా । గురుదేవ । ర ॥ యీబాలుని బారినిజేరి సైపలేము ॥ ర ॥
చండమార్తాండుడనన్ । నిండువేడి మీతోనిండివెలిగెడి ॥ ర ॥
మాక్షికములగ్గిని । వీక్షించి మగ్గిన విధమాయెమ్మమింక ॥ ర ॥

## (4) 24-6 భీముడు—యమునారాగం—ఆదితాళం

లకనిన్ను బాళి బ్రతుకంగజాలనాడు।బ్రారబ్ధమిటులాయెగా।అహా నాయన్నా ॥ బా
ంచినాపూర్వసంచితామెల్లానింక్నె । ద్రుంచిదాపురామాయెగా । అహా ॥ ద్రు॥

కరుబున్న నేలా ఈశిరులుంన్న నేలానిన్ కరముగూడాకయున్నను॥ అహా ॥ క ॥
బరుతెందరుంన్న నేమి ఫలముసీవ్రలేకున్న పాపచిత్తుడనైతిగా॥ అహా॥ పా॥

(5) 28-5 అర్జనుడు—అసావేరి—అటతాళం

యేమనిసైతు నావిధి ॥యె॥ ప్రేమనునినుబెంచి పెద్దనగుదువని పెంళ్లిజేసి నేనుంటిగా అహానాయన్నా॥ యేమి ॥

బలువురముమే ముండి పాపమనాకానింన్నా । పాపులపాల్రదోసితి॥ అహా । యె॥
బారుడేటికిపద్మ్రంధము మెుహరించే । పరగనేనులేకుండగా ॥ ఆ ॥
బలువురునోకాటిగాం బాలునిబట్టిజంపా । బాపమనగా తగదె॥ ఆ ॥ యె॥

(6) 29-24 అర్జనుడు—అమీరుకళ్యాణి—అటతాళం

పాపియగు సైంధవునిరేపే । బట్టిప్పంచెనజామునుసీ పాపమనకయ పాపిశంకరు ప్రాపుజేరిన వీడికన్ ॥ పా ॥

యినుడు హస్తాచలమునందున నింపుమీరుచునుండగన్ । దాపునను కర్ణాదియోధులు ధైర్యమునగాపాడగన్ ॥ పా॥

దుష్టులగుదుర్యోధనాదుల । దులుబదనములు బలుపడిన్ బరువువడయర్జనుడువీడన బట్టి జంపిన దుష్టునిన్ ॥ పా ॥

(7) 38-9 సుభద్ర—శ్యామరాగం—ఆదితాళం

కన్నకూన నిన్నుబాశి కనలుదానరా । నావిన్నపంబు నీదుచెవుల । వినవదేమిరా ॥క॥
యుప్వాయప్వాయనుచువెంట। నాడనెవరురా। దవ్వుసేయనిముసమైన దాళలేనురా ॥ క ॥
తండ్రిసుద్దుదీరదివిరి। దయనుబలుకరా । కన్నదాన నెటులకఠిన। ఖర్మ్రమోర్తురా ॥క॥
నీవులేని సంపదలిల నిలువనేలరా। బాలుమాలిధాతగతిని। బాడుచేసెరా ॥ క ॥

(8) 37-29 చారుడు—బలహంసరాగం—ఆదితాళం

పారీపోవగాసాగే। ఆమందుడు డెందము గందగుందుచును ॥ పా ॥
కన్నులనీరులొలుకా। గన్నదమవార। లెంన్నోనింద్యములు బలుకా ।

ఫిఒన్నాకైనలవంచి| నన్నసంన్నానేనురువడి ॥ బా ॥
కర్ణుడాదిగానగగా| గురుకృపాశల్యులెంనోన్న గతులాగోణుగా |
ఒన్నగామేన బాణిముస్నా జాలుననుచు ॥ బా ॥
రారాజు వైబట్టుక| నిలువరయోాతి తులువాయనుచు దట్టగా |
బలుకాక నీవన్న బలుకులకేవాడు ॥ బా ॥

## (9) 71-12 కృష్ణుడు—జంజూటిరాగం—ఆదితాళం

దునుమనమయామిదె | ఆ ; పాపియాసైంధావు బట్టిదిట్టరూవై ॥ దు ॥
యినుడుగ్రుంకేనానుచు నాదగుమాయ యనిగానకను బొంగుచూ |
యరికోననిలచీ యానమెత్తుచుంన్నాడు ॥ దు ॥
వంతలుదీరగను | యాశత్రుడు | నంతామునోంపగను | నెంత్తావేగరమున |
ద్రుంతువోగాంతును ॥ దు ॥ ౨ ॥
కురురాజు జింతిల్లగా యాకర్ణాదులు | వడిగంపింపగా |
బరువడియారాజు | దలనీడబడకుండ ॥ దు ॥ 3 ॥

## (10) అందరు—మంగళకౌశికరాగం—రూపకం

మంగళమిదె మంగళాంగునకు | శమా ; యంగానాపతికినీ లాంగునకు శుభ ॥ మం ॥
కృష్ణునకును ; రిపుజిష్ణునకు | వర్ధిష్ణునకును యాదివిష్ణునకు శుభ ॥ మం ॥ మం ॥ ..
సైంధవాజున నాట్యసాక్ష్యునకు | సాధుపక్షాలక్షణ విచక్షునకు శుభ ॥ మం ॥



నవలలు

| | | |
|---|---|---|
| సౌందర్యతిలక-రెండుభాగములు | 1 | 0 |
| హేమలత | 0 | 8 |
| అహల్యాబాయి | 0 | 8 |
| మహాపురుషుల జీవితములు-మొదటిభాగం | 0 | 12 |
| డిటో రెండవభాగము | 0 | 10 |
| రాజస్థానకథావళి | 0 | 12 |
| డిటో రెండవభాగము | 0 | 12 |
| వినోదములు మొదటిభాగం | 0 | 4 |
| డిటో రెండవభాగము | 0 | 4 |
| వీరబలవినోదములు | 0 | 6 |
| అబలాసచ్చరిత్రరత్నమాల | 1 | 0 |
| కృష్ణదేవరాయచరిత్ర | 1 | 4 |
| గృహకల్లోలనివారణి | 0 | 8 |

పద్యకావ్యములు.

| | | |
|---|---|---|
| వరాహపురాణము | 1 | 0 |
| మార్కండేయపురాణము | 1 | 4 |
| పద్మపురాణము ఉత్తరఖండం | 1 | 4 |
| భోజరాజీయము | 1 | 0 |
| ఉత్తరహరివంశము | 1 | 4 |
| మొల్లరామాయణం | 0 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నం | 0 | 8 |
| రాజశేఖరచరిత్ర | 0 | 8 |
| అడిదం సూరకవిగ్రంథములు | 0 | 8 |
| హరిశ్చంద్రోపాఖ్యానము (శతకాకః) | 0 | 8 |
| కవిరాజమనోరంజనం | 0 | 8 |
| జైమినీభారతము | 0 | 10 |
| సుదక్షిణాపరిణయం | 0 | 10 |
| చమత్కారమంజరి | 0 | 4 |
| ప్రబోధచంద్రోదయం | | 0½ |
| వైజయంతీవిలాసము | 0 | 6 |
| దశావతారచరిత్ర | 1 | 0 |
| విజయవిలాసము | 0 | 6 |
| రసికజనమనోరంజనం | 0 | 6 |
| విజయచకోరచంద్రోదయం | 0 | 6 |
| ఆముక్తమాల్యద సటీక | 2 | 8 |
| శృంగారనైషధం | 0 | 6 |
| కళాపూర్ణోదయం | 1 | 8 |
| సరసభూపాలీయం | 0 | 8 |
| ఆంధ్రభాషాభూషణం | 0 | 2 |
| అప్పకవీయం | 0 | 12 |
| సులక్షణసారం | 0 | 8 |
| లీలాసుందరీపరిణయం | 0 | 4 |
| సుబ్రహ్మణ్యచరిత్ర | 0 | 10 |
| శశిరేఖపద్యం | 0 | 4 |
| శ్రీనాథునివీధినాటకం | 0 | 1 |
| చిత్రరాఘవము | 1 | 0 |

## డ్రామాలు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| గయోపాఖ్యానం | 0 | 8 | చంద్రగుప్త | | 12 |
| ప్రసన్న యాదవము | 0 | 8 | విచిత్రబిల్హణీయం | 0 | 8 |
| పారిజాతాపహరణం | 0 | 8 | పాండవజననము | 0 | 9 |
| సుగుణామణి | 0 | 8 | పాండవప్రవాసం | 0 | 12 |
| చంద్రకాంత | 0 | 8 | పాండవవిజయం | 0 | 12 |
| సంగీతశశిరేఖ | 0 | 8 | పాండవఅశ్వమేధం | 0 | 12 |
| అభినవరాఘవము | 0 | 8 | పాండవఉద్యోగం | 0 | 12 |
| హస్తినాపురం | 0 | 8 | పాండవఅజ్ఞాతవాసం | 0 | 6 |
| ఉషాపరిణయం | 0 | 8 | నర్మదాపురుకుత్సీయం | 0 | 12 |
| సుశీల | 0 | 8 | సారంగధర | 0 | 8 |
| పీష్వానారాయణరావువధ | 0 | 8 | ప్రచండచాణక్యం | 0 | 12 |
| జయంతజయపాల | 0 | 6 | విప్రనారాయణచరిత్ర | 0 | 12 |
| అభిజ్ఞాన శాకుంతలము | 1 | 0 | విజయరాఘవము | 1 | 0 |
| వేణీసంహారం | 0 | 14½ | వనవాసరాఘవము | 0 | 12 |
| మల్లికామారుతం | 0 | 14 | కుశలవనాటకము | 0 | 12 |
| ప్రబోధచంద్రోదయం | 0 | 10 | సంగీత సత్యహరిశ్చంద్ర | 0 | 12 |
| ద్రౌపదీస్వయంవరం | 0 | 8 | వరూధినీవిలాసము | 0 | 10 |
| సంగీతపాశుపతార్జునం | 0 | 8 | చిత్రనళీయం | 1 | 4 |
| సంగీతసైంధవార్జునం | 0 | 8 | విషాదసారంగధర | 1 | 2 |
| హరిశ్చంద్ర | 0 | 8 | చంద్రమతీపరిణయం | 0 | 8 |
| కలభాషిణి | 0 | 12 | సంగీతసావిత్రి | 0 | 4 |
| బొబ్బిలియుద్ధం | 0 | 12 | దక్షిణగోగ్రహణం | 0 | 4 |
| గులేబకావళి | 0 | 13 | రత్నావళి | 0 | 6 |
| జయచంద్రచంద్రరేఖావిజయం | 0 | 12 | ప్రహ్లాద | 0 | 4 |

వలయువారు క్రింది యడ్రస్సునకు దరఖాస్తులు పంపవలెను.

కర్రా అచ్చయ్య బుక్కు సెల్లరు,

రాజమండ్రి.